స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామా నాయుడు

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

యానాదిరెడ్డిని ఇన్నాళ్లకు కరుణించాడు ఆ ఈశ్వరుడు

# కల నిజమైంది!

యానాది రెడ్డి గారి కల నిజమైంది; నిరీక్షణ ఫలించింది; కోర్కె ఈడేరింది; శివ ప్రసన్నం లభించింది; మంత్రి అయి పోయారు అపును. నిజంగానే శ్రీ కలికి యానాది రెడ్డి మంత్రి అయ్యారు. ఎన్నేళ్ల కల, ఎన్ని రోజుల తపన్ను, ఎన్ని గుండెల్లు ఈశ్వర పూజ, ఎంత తపన, ఎంత ఆరాటం, ఎన్ని వ్యూహాలు, ఎన్ని ప్రయత్నాలు? యానాదిరెడ్డి గారికి మామూలు గానే కాలొక చోట నిలవదు, ఇప్పుడెట్లా వున్నాడో చూడాలని వుంది! మాట వినగలం కాని, హైదరాబాదులో వున్న మనిషిని చూడడమెట్లా? ఇంత సంతోషాన్ని ఎట్లా భరిస్తున్నాడో మరి? ఎవరూ లేకుండా చూసి ఎగిరి గంతు వేసి వుంటాడు.

యానాదిరెడ్డి గారి మంత్రిత్వం నూటికి నూరుపాళ్లు - స్వయంకృప ఫలితం. ఎవరి అండ, ఆశ్రయం కోరకుండా, చిల్లర దేముళ్లు వెదికి మొక్కకుండా, మూలవిరాట్ అయిన ముఖ్యమంత్రి గారిని పదకొండు నెలల పాటు ఏక దీక్షతో, భక్తి ప్రపత్తులతో కొలిచి సాధించుకొన్న వరం ఈ పదవి. మాగుంట సుబ్బరామ రెడ్డి గారి మాటసాయం; జె.కె. విఘ్నల తోడ్పాటు లేకుండా పోలేదు. కాని వాటి ప్రభావం కంటే కోట్ల వారి కరుణా కటాక్ష వీక్షణాల కోసం తాను చేసిన తపస్సే ప్రగాఢమైనది. కోట్లతో యానాదిరెడ్డి గారికి పూర్వాశ్రమం నుంచి పరిచయాలు, పలుకరింపులు వున్నాయి. ముఖ్యమంత్రి అయిన తర్వాత వాటిని మరింత సుదృఢం చేశారు. మంత్రి వర్గ విస్తరణ తలపెట్టి ఢిల్లీకి వెళ్లినప్పుడే కలికి చెవిలో శుభవార్త వేశారట ముఖ్యమంత్రి. అప్పటి నుంచి పట్టరాని టెన్షన్. నరాలు చిట్లే ఉద్రిక్తత.

కేవలం కోట్ల ప్రసన్నతే యానాదిరెడ్డి మంత్రిత్వానికి కారణం కాదు. అంతకు మించి, జిల్లాలో ముఖ్యమంత్రి ఆడబోతున్న రాజకీయ చదరంగపు వ్యూహాల ప్రభావమూ వుంది! నెల్లూరు జిల్లాలో ఇప్పటి వరకు నేదురుమల్లి జనార్దన రెడ్డికి ఎదురు లేదు. పది మంది ఎమ్మెల్యేలూ - మనసులో కొరతలున్నా, కుతకుత ఉడికే కోప తాపాలున్నా - పైకి జనార్దన రెడ్డితోనే వున్నారందరూ! యానాదిరెడ్డితో సహా అంతే! ఇది ఎంత కాలం సాగుతుంది? ఎంతో కాలం సాగనివ్వడమూ ముఖ్యమంత్రికి ఇచ్ఛగించి నట్లు లేదు. జనార్దన రెడ్డి స్పీడుకు బ్రేక్ వేయకుంటే, పరుగుకు కళ్లెం లాగ కుంటే మనసు నిలవదు కదా! అటువంటి స్పీడ్ బ్రేకర్‌గా యానాదిరెడ్డిని ఎంపిక చేశాననడం అపోహ కానే కాదు. రాజకీయాలలో పైకి నటించే స్నేహాలు ఎప్పుడూ నిజం కావు.

ఎట్లయితేనేమి యానాదిరెడ్డి గారి కోరిక తీరింది. పంచాయితీ సర్పంచ్‌గా జీవితం ప్రారంభించిన వాడు, రాష్ట్ర మంత్రిత్వానికి ఎదగ గల్గాడు. జిల్లాలో యానాదిరెడ్డి గారు తొలిగా అందరికీ తెలిసింది ఆయన 1970లో పంచాయితీ సమితి అధ్యక్షుడుగా ఎన్నికైనప్పుడే. అయ్యపురెడ్డి, కొండప నాయుడు వంటి ఆనాటి హేమాహేమీలను ఢీకొని, కావలి నియోజక వర్గంలో తన కంటూ

కొరవ 10 పేజీలో

## టిక్కెట్లిచ్చేప్పుడు ఈ లెక్కలు పాటించారా?

మంత్రి వర్గంలో తమకు సరైన ప్రాతినిధ్యం కల్పించలేదని వెనుకబడిన తరగతుల నాయకులు మండి పడుతున్నారు. దీనికి తగ్గట్టు, ఎమ్మెల్యేలలో కులాల వారీగా సంఖ్యకు, మంత్రుల సంఖ్యకు శాతం తీసి ప్రభుత్వం అనధికారికంగా విడుదల చేసిన వివరణ వీరికి

### కులాల శాతం పై బీసీల ప్రశ్న

పుండు మీద కారంవలె కన్పిస్తున్నది. కాంగ్రెస్ ఎమ్మెల్యేలలో రెడ్ల సంఖ్య 68 అయితే 13 మందికి (19శాతం) బీసీలు 23మంది వుంటే 8 మందికి (34 శాతం) మంత్రిత్వాలు పంచామని, రెడ్డి, కమ్మ, హరిజన, గిరిజన, మైనారిటీలు వేటిని చూసినా బీసీలకే అధికశాతం మంత్రి పదవులు ఇచ్చామని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. మర్రి తులసీదాస్, వి. హనుమంతరావు, పంతం పద్మనాభం తదితర నాయకుల విమర్శలకు సమాధానంగా ఈ వివరణ ఇచ్చారు. అయితే బీసీ నాయకులు దీనితో సంతృప్తి పడడం లేదు. టిక్కెట్ల పంపకంలోనే అన్యాయం చేసి ఇప్పుడు గెల్చిన ఎమ్మెల్యేల ప్రాతిపదికగా శాతం కట్టడం అన్యాయమని ఆరోపిస్తున్నారు. టిక్కెట్లిచ్చేటప్పుడు జనాభాలో కులాల ప్రాతిపదికన బీసీలకు ఛాన్సు ఇచ్చి వుంటే లెక్క సబబుకాని ఇప్పుడెట్లా సమ్మతమౌతుం దంటున్నారు వారు. తమకు కాంగ్రెస్‌లో ఎప్పటికీ న్యాయం జరగదనే నిస్పృహ పలువురిలో కన్పిస్తున్నది. తెలుగు దేశంలో పరిస్థితి మరీ ఘోరం. చిరంజీవి శరణుజొచ్చడమే తరుణోపాయమని మద్రాసుకు విమానం టిక్కెట్లు కొంటున్నారు పలువురు నాయకులు.

# సంఖ్య పెరిగి సమర్థత తగ్గింది!

ఎట్టకేలకు, చిట్ట చివరకు, తుట్ట తుదకు ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు తన మంత్రి వర్గాన్ని విస్తరించుకో గల్గారు; తన కోరిక తీర్చుకున్నారు. పదకొండు నెలల పాటు రేపు, మాపు అంటూ వాయిదాల పై వాయిదాలు పడిన ఆ ముచ్చట తీరిపోయింది. 8 తేది సప్తమి, బుధవారం శుభ ఘడియలలో 16 మంది నూతన మంత్రులు పదవులు స్వీకరించారు; నలుగురు పాత మంత్రులు ఇళ్లకు వెళ్లారు. ఇప్పుడు మంత్రి వర్గం సంఖ్య 42. అందులో 24 మంది క్యాబినెట్ మంత్రులు; 18 మంది సహాయ మంత్రులు.

7 తేది సాయంత్రం పాత మంత్రులందరూ ముఖ్యమంత్రికి రాజీనామా పత్రాలు సమర్పించారు. వాటిలో ఆరు కాగితాలను గవర్నర్‌కు పంపాలని విజయభాస్కర రెడ్డి తలపెట్టారు. కాని అది అనుకున్నంత సులభం కాలేదు. ఉద్వాసనా జాబితాలోని పేర్లు బయటకు పొక్కాయి. ఎవరి శక్తి మేరా వారు ముఖ్యమంత్రి పై వత్తిడి తెచ్చారు. వాటిని తట్టుకోవడం ఆయన తరం కాలేదు. పెంచలయ్య విషయంలో జనార్దన రెడ్డి ఉడుంపట్టు పట్టారు; సరె ననక తప్పలేదు. వరంగల్ జిల్లాకు చెందిన మునిసిపల్ మంత్రి శ్రీ మాదాటి నరసింహా రెడ్డిని తీయ వద్దని కేంద్ర మంత్రులు కమాలుద్దీన్, మల్లిఖార్జున్ బ్రతిమలాడారు. నరసింహా రెడ్డిని తొలగించి పురుషోత్తమ రావును నియమించాలన్నది కోట్ల తలంపు; అది నెరవేర లేదు. చివరకు సంతోష్ రెడ్డి, మోహన రావు, మహమ్మద్ జానీ, సి. రామచంద్రా రెడ్డి లను మాత్రం తొలగించారు.

## శాఖలు పంచింది ఛీఫ్ సెక్రటరీ- ముఖ్యమంత్రికి సిగ్గు చేటు కాదా ఇది?

కొత్త మంత్రుల ఎంపికలో ముఖ్యమంత్రి స్వతంత్రంగా వ్యవహరించి నట్లే లెక్క. మంత్రి వర్గ విస్తరణ చేపట్టబోయే ముందు మార్పు, చేర్పుల పట్టిక తనకివ్వాలని ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు మొండి పట్టు పట్టినా, ఇచ్చేది లేదని భీష్మించుకొని, వారం రోజులు ఢిల్లీలోనే మకాం పెట్టి, తన పంతం నెగ్గించుకొని వచ్చిన ముఖ్యమంత్రి ఆ స్వాతంత్ర్యాన్ని కాపాడుకున్నారు. మొత్తం 16 మంది మంత్రుల ఎంపిక ఆయన ఇష్టానుసారమే జరిగింది. సాధ్యమైనంత వరకు అన్ని వర్గాలకు, అన్ని ముఠాలకు, అన్ని కులాలకు ప్రాతినిధ్యం కల్పించేందుకు శ్రద్ధ తీసుకున్నారు ముఖ్యమంత్రి. మొత్తం 42 మందిలో ఎస్‌సిలు, బిసిలు ఎనిమిదేసి మంది, ఎస్‌టిలు, మైనారిటీలు ఇద్దరు, లెక్కన వున్నారు. మహిళల సంఖ్య మూడు. చేనేత, మత్స్య, యాదవ, బ్రాహ్మణ వైశ్యులకు ఒక్కొక్కర్ని ఇచ్చారు. రెడ్లదే అధిక సంఖ్య; మొత్తం 13 మంది వున్నారు. కమ్మ వారి సంఖ్య మూడు మాత్రమే.

రాజకీయ ముఠాలలో వై.ఎస్. రాజశేఖర రెడ్డికి పెద్ద పీటవేశారు. కర్నూలులో తన కుమారుడి రాజకీయ అరంగేట్రం జరుగనున్న సమయంలో వైఎస్‌తో పేచీ పెట్టుకుంటె ప్రమాదమని భయపడి నట్లుంది. అందువల్లనే రాజశేఖర రెడ్డిని పిలిపించుకొని గంటకు పైగా సమాలోచనలు జరిపారు. ఆయన చెప్పిన పేర్లన్నింటినీ జాబితాలో చేర్చారు. మర్రి చెన్నారెడ్డి వర్గాన్ని సంతృప్తి పరచే ప్రయత్నం జరిగింది. శశిధర్ రెడ్డికి స్థానం కల్పించారు. ద్రోణంరాజును సంతుష్టుణ్ని చెయడం కోసం సత్యారావును మంత్రి వర్గంలోకి తీసుకున్నారు. ఒక్క జనార్దన రెడ్డి వర్గానికే కత్తిరింపు పడింది. ఆయనతో మంత్రి వర్గ మార్పుల పై ఎటువంటి చర్చలూ జరపలేదు. ఆయన మనిషిగా ఎవర్నీ కొత్తగా తీసుకోలేదు. అయితే జనార్దన రెడ్డిల అనుయాయులుగా పేరు పడిన సాంబశివ రాజు, పెంచలయ్య, పి. జనార్దన రెడ్డి, కన్నా లక్ష్మీ నారాయణ, దివాకర రెడ్డి, మైసూరా రెడ్డి, సమర సింహారెడ్డి, మాగంటి వరలక్ష్మి, కోనేరు రంగారావు తదితరులందర్నీ యథాతథంగా

కొరవ 10 పేజీలో

# ఆమె దృష్టిలో పసి పిల్లలు ప్రాణమున్న ఆటబొమ్మలు!

(గతవారం కొరవ).

''బాలనేరస్తురాలు'' సొందాయమ్మ కేసు విచారణ సిబిసిఐడి స్వీకరించింది. అంటే ప్రభుత్వం ఈ కేసులోని సీరియస్ నెస్ను అర్థం చేసుకున్న దన్నమాట. ప్రజాందోళనకు, పత్రికా వార్తల అలజడికి ఎంతటి మొండి వారైనా లొంగక తప్పదని దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

అనాథగా జీవితం ప్రారంభించిన సొందాయమ్మ లక్షాధికారిణిగా మారడం వెనుక ఏదో మిస్టరీ వుండాలని గత వారం వ్రాశాము. పసిపిల్లలను ప్రాణం వున్న బొమ్మలవలె విక్రయించే వ్యాపార రహస్యం నేర్చుకోవడమే ఆ మిస్టరీ! అసలామెకు ఈ వ్యాపారాన్ని ఎవరు బోధించారు? తడ వంటి మారు మూల పల్లెలో వుండే ఆమెకు అమెరికా, అరేబియా వంటి సుదూర దేశాలలోని వారితో పరిచయమెట్లా కల్గింది? పిల్లల మార్పిడి సమయంలో రేటు ఎవరు కుదిర్చి పెట్టేవారు? వచ్చిన విదేశీ ద్రవ్యం ఎవరు రూపాయలలోకి మార్చేవారు? అవి ఎవరి ఖాతాలో జమ పడేవి? ఇప్పటివరకు సొందాయమ్మ ఎందరు పిల్లలను సేకరించింది? ఎందర్ని విదేశాలకు పంపింది? తక్కిన వారేమైనారు? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు తెలిస్తే ఆ మిస్టరీ విడిపోతుంది. సొందాయమ్మ చెప్పే వివరాలు వీటికి సమాధానాలుగా ఉపకరించడం లేదు. హైదరాబాదులోని యాక్షన్ ఫర్ సోషల్ డెవలప్‌మెంట్ అనే సంస్థ ద్వారా సొందాయమ్మ కార్యకలాపాలు జరిగినట్లున్నాయి. ఈ

## సొందాయమ్మ చేజిక్కిన పిల్లలు వీరు!

1988 నుంచి 1993 వరకు తాను సేకరించిన పిల్లలని సొందాయమ్మ చెప్పే జాబితా ఇదీ. విదేశాలకు తరలించిన పిల్లలను చివర (వి) అని మరణించిన వారిని చివర (మ) పేర్కొంటున్నాము. మిగతా వారు స్వదేశంలోనే వున్నారట.

| పిల్లల పేర్లు | వూరు | తల్లి | తీసుకెళ్లిన తేది |
|---|---|---|---|
| సైమన్ | నెల్లూరు | ఉమ | 4.8.88 (వి) |
| సుజాత | నాయుడుపేట | రాధ | 27.9.88 (వి) |
| శ్యామల | నాయుడుపేట | దేవి | 16.10.88 (వి) |
| లిల్లీ | కురుగొండ | బుజ్జి | 19.1.89 (మ) |
| సంతోష్ | నాయుడుపేట | నాగమ్మ | 26.2.89 |
| రాజా | తుందూరు సొసైటీ | మస్తానమ్మ | 21.4.89 (వి) |
| మునిలక్ష్మి | ఓజిలి | మునిరత్నం | 11.8.89 (వి) |
| కరుణాకర్ | కురుగొండ | పోలమ్మ | 8.5.89 |
| కాంతమ్మ | భీమునివారి పాళెం | రామగోవింద | 1.9.89 (వి) |
| చంద్ర | నాయుడుపేట | సల్లెమ్మ | 13.10.89 |
| ధనలక్ష్మి | ఖమ్మం | పెద్దలక్ష్మమ్మ | 18.10.89 (వి) |
| సుమలత | కాపులూరు | ఎవరూ లేరు | 1.12.89 (వి) |
| కిన్నెర | వెంకటగిరి | ధనలక్ష్మమ్మ | 5.3.90 (వి) |
| నవమణి | కాపులూరు | వెంకటమ్మ | 11.3.90 (మ) |
| దీన | కాళహస్తి | మస్తానమ్మ | [illegible] |
| ఆనంద రావు | నెల్లూరు | కమలమ్మ | 8.6.90 |
| హేలత | సిరసనంబేడు | అల్లెమ్మ | 23.7.90 |
| దేవకళ | తుమ్మూరు | రమణమ్మ | 26.10.90 (వి) |
| జ్ఞానమణి | తుమ్మూరు | పి. రమ | 26.10.90 |
| లాజర్ | ఏకొల్లు | వెంకటమ్మ | 28.5.91 (వి) |
| బేబి సుకన్య | భీమునివారిపాళెం | మునెమ్మ | 8.3.92 |
| సుబ్రహ్మణ్యం | భీమునివారిపాళెం | చంద్రయ్య | 11.4.92 |
| ప్రియమంజరి | తిరుపతి | పద్మ | 8.5.92 |
| జెమ్స్ | నాయుడుపేట | సుబ్బరత్నమ్మ | 4.7.92 |
| టి. విలియమ్స్ | తడ | బుజ్జమ్మ | 11.8.92 |
| ప్రభావతి నిర్మల | నెల్లూరు | యశోదమ్మ | 13.12.92 |
| ప్రాన్సిస్‌కుమార్ | కాపులూరు | బుజ్జమ్మ | 8.1.93 |
| సూర్యచంద్ర | తుమ్మూరు | రత్నమ్మ | 24.3.93 |
| మేరి భువనేశ్వరి | తడ | నిర్మల | 4.5.93 |



పసి పిల్లల విక్రయ ధనంతో పచ్చటి జీవితాన్ని గడుపుతున్న ఒకనాటి అనాథ నేటి ''బాల'' నేరస్తురాలు సొందాయమ్మ భవంతి.

# సొందాయమ్మ తప్పు చేయలేదని ముందే ఎందుకు చెప్తున్నది పోలీసు?

సంస్థకు కేంద్ర ప్రభుత్వ గుర్తింపు వుందికాని, రికార్డులు పరిశీలిస్తే ఇప్పటి వరకు ఆ సంస్థ ద్వారా ఒక్క పసిబిడ్డ కూడా విదేశాలకు దత్తత వెళ్లినట్లు కన్పించడం లేదు. 29 మంది పిల్లలను మాత్రమే తాను సేకరించానని ఆమె చెప్తున్నది. కాని సబ్ కలెక్టర్ దర్యాప్తులో 47 మంది పిల్లల ఆచూకీ తేలాలని పేర్కొన్నారు. అనధికారిక లెక్కల ప్రకారం 85 మంది వరకు కన్పడుతున్నారట. హైదరాబాదు సంస్థను ప్రభుత్వం గుర్తించింది 1989లో; 91-92 వరకు వారు అధికారికంగా ఎవర్నీ విదేశాలకు పంపలేదు. మరి ఇందరు పిల్లలు ఏమైపోయినట్టు? విదేశాల్లో వున్న వారి వివరా డిగితే ఐదుగురి ఫోటోలు మాత్రం చూపుతున్నది. వారి చిరునామాలడిగితే చెప్పడం లేదు. స్వదేశంలో 15 మందిని దత్తత ఇచ్చాననుంది కాని- వివరాలు చెప్పడంలేదు. అందువల్లే ఆమెను అ[illegible] తీవ్రంగా అనుమానించాల్సి వస్తున్నది.

దత్తత విషయంలో చట్టం ప్రకారం కూడా వ్యవహరించినట్లులేదు. చట్టం ప్రకారం అమ్మకం నిషిద్ధం. కాని లోపాయికారి తనంగా అది జరిగి పోతున్నది. 1984లో సుప్రీం కోర్టు ఈ చట్టానికి సవరణలు చేస్తూ కొన్ని నిబంధనలు విధించింది. తల్లిదండ్రులు స్వచ్ఛందంగా తమ పిల్లలను ఇస్తున్నట్లు స్టేట్‌మెంట్ వ్రాసి ఇవ్వడంతోపాటు, పోలీసులు దాన్ని విచారించి నిర్ధారించాలి. తర్వాత కోర్టుకు ఈ విషయం నివేదించి, కోర్టుద్వారా వచ్చే దర్యాప్తు అధికారి ఆ పిల్లలు అనాథలని, లేదా తల్లిదండ్రులు ఇష్టపడి ఇచ్చారని ధృవపరచాలి. ఆ తర్వాత 3 నెలలపాటు పిల్లల తల్లిదండ్రులలో మార్పు వస్తుందేమోనని ఎదురు చూడాలి. అప్పుడు నోటరీ, భారత దౌత్య కార్యాలయం, దత్తత తీసుకొనే విదేశీ తల్లిదండ్రులు రంగంలోకి వస్తారు. వారు ఎన్నో సర్టిఫికెట్లు పొందు పరచవలసి వుంటుంది. ప్రతి సంఘ సేవా సంస్థ ఇందుకోసం ఒక న్యాయవాదిని నియమించుకోవాలి. సొందాయమ్మ విషయంలో ఇవేవీ జరిగినట్లు ఆమె నిరూపించ లేక పోతున్నారు. మరి ఏ నిబంధనా పాటించకుండా పిల్లలను దేశమెట్లా దాటించ గల్గింది? సిబిసిఐడి దర్యాప్తులో కాని ఈ నిజనిజాలు వెలికి రావు.

సొందాయమ్మ మాత్రం చాలా నిబ్బరంగా వుంది. నేను పంపిన పిల్లలందర్నీ చట్ట ప్రకారమే పంపాను. చట్టవ్యతిరేకంగా వ్యవహరించి వుంటే వురి తీయండి అంటున్నారామె. ఒక క్రిష్టియన్‌కు, ముస్లింకు, పుట్టిన సైమన్ అనే బిడ్డను నాకు ఖమ్మంలో రహస్యంగా అప్ప చెప్పారు. వాడిప్పుడు అమెరికాలో దర్జాగా బ్రతుకుతున్నాడు. సుజాత అనే మరొక బాలికను ఆమె తల్లి ఎటువంటి పరిస్థితుల్లో నాకు వప్పగించిందో నాకు తెలుసు. నేనే బిడ్డనూ అమ్ముకోలేదు. నేను వారికొక గైడ్ వలె వ్యవహరించానిందాను తప్ప, వ్యాపారం చేయలేదు. వచ్చిన నిధులన్నింటికీ లెక్కలున్నాయి. నేను అనాథను; అనాథలను ఎట్లా వంచిస్తాను చెప్పండి? సబ్ కలెక్టర్ నివేదిక ఏక పక్షమైనది. ఈ ఆరోపణలతో నేను మానసికంగా కృంగి పోయాను అన్నారామె. తనపై ఈనాడు విలేఖరి కక్ష కట్టి ఇంత రభస చేశాడని, అబద్ధాలు వ్రాసి అలజడి సృష్టించాడని, తన కాన్వెంట్ వల్ల అతడి స్కూల్లో పిల్లలు చేరడం తగ్గడంతో అసూయతో ఆరోపణలు చేశాడని సొందాయమ్మ చెప్తున్నారు.

కొరవ 6 పేజీలో

**అనాధలు అభాగ్యుల దైన్య స్థితే వ్యాపారానికి పెట్టుబడిగా లక్షలార్జించిన మహిళ కథ**

# జమీన్‌రైతు
## రిజర్వేషన్లు

రిజర్వేషన్ల కందిరీగల తుట్టెను మళ్లీ కదిలించింది కేంద్ర ప్రభుత్వం. కేంద్ర సర్వీసులు, పబ్లిక్ అండర్ టేకింగ్స్ సంస్థలు, బ్యాంకులలో తక్షణం అమలు చేసే విధంగా రిజర్వేషన్ల ఉత్తర్వు జారీ చేసింది. సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడి వున్న తరగతుల వారికి ఉద్యోగాలలో 27 శాతం రిజర్వేషన్ సౌకర్యం కల్పించింది. మండల్ కమిషన్ నివేదిను యథాతథంగా అమలు చేస్తూ, సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు ప్రకారం ఆర్థికంగా అభ్యున్నతి సాధించిన వెనుకబడిన (క్రీమీ లేయర్) వారిని రిజర్వేషన్ల పరిధి నుంచి మినహాయించారు. దీని ప్రకారం దాదాపు 1200 కులాలు, వర్గాలకు చెందిన వారు రిజర్వేషన్ల సౌకర్యం పొందుతారు. మండల్ పేర్కొన్న కులాల జాబితాను ప్రభుత్వం యథాతథంగా ఆమోదించింది. వెనుకబడిన తరగతులకు చెందినప్పటికీ ప్రతిభతో ఉద్యోగార్హత పొందే వారిని రిజర్వేషన్ల కోటా క్రింద పరిగణించరు. వారు ఫార్వర్డ్ కులాల వారితో ఉద్యోగాల పోటీలో పాల్గొంటారు.

'క్రీమీలేయర్' గా పిలువబడే అభివృద్ధి చెందిన వెనుకబడిన తరగతుల వారి క్రింద – రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి, సుప్రీం కోర్టు, హై కోర్టు న్యాయమూర్తులు, చీఫ్ ఎలక్షన్ కమీషనరు, పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులు చేరుతారు. ఐఎఎస్, ఐపిఎస్ వంటి గ్రూప్ ఎ అధికార్లు, అదే స్థాయిలోని బ్యాంకులు, ఇన్సూరెన్స్ వంటి పబ్లిక్ రంగ సంస్థల ఉద్యోగులు, విశ్వవిద్యాలయం అధికార్లు రిజర్వేషన్లకు అనర్హులు. గ్రూప్ బి, క్లాస్ 2 అధికారులకు సంబంధించి, పిల్లల తల్లిదండ్రులు ఇద్దరూ అదే తరగతి అధికారులైనా, తండ్రి మాత్రమే ఆ తరగతి అధికారై 40 ఏళ్ల లోపు ప్రమోషన్ పొందినా రిజర్వేషన్‌కు అనర్హులు. వ్యవసాయ పరంగా, సీలింగ్ పరిమితిలో 85 శాతం భూమి కల్గిన కుటుంబాలలోని పిల్లలూ రిజర్వేషన్లకు పనికి రారు. అయితే పార్లమెంట్, శాసన సభ్యులు, కేంద్ర రాష్ట్ర మంత్రుల పిల్లలు రిజర్వేషన్ల కోటా క్రింద ఉద్యోగాలు పొందవచ్చు. ఎంపిక చేసిన 1200 కులాల గుర్తింపు, రిజర్వేషన్ల ఫార్ములా రెండేళ్ల వరకు అమలులో వుంటుంది. ఆ తర్వాత పరిస్థితి అధ్యయనం చేసి మార్పులు కావలసి వస్తె చేస్తారు.

ఒకటిన్నర దశాబ్దం పై నుంచి వివాదాస్పదంగా వుంటున్నది మండల్ కమిషన్ నివేదిక. తొలి సారిగా తన రాజకీయ ప్రత్యర్థులను చావు దెబ్బ కొట్టడానికి విపిసింగ్ దీని దుమ్ము దులిపాడు. అప్పట్లో ఆ నిర్ణయం దేశమంతటా అరాచకం ప్రేరేపించింది. సుప్రీం కోర్టు దీనిపై అసాధారణ స్థాయిలో తొమ్మిది మంది సభ్యుల రాజ్యాంగ ధర్మాసనం ఏర్పరచి విచారణ జరిపి, తీర్పు ప్రకటించింది. 27 శాతంతో పాటు, ఆర్థికంగా వెనుకబడిన అగ్ర వర్ణాల వారికి పివి నరసింహా రావు ప్రభుత్వం 1991లో చేసిన 10 శాతం రిజర్వేషన్లనూ సుప్రీం కోర్టు కొట్టి వేసింది.

ఈ నేపథ్యంలో ఇప్పుడు పివి మళ్లీ ఈ కందరీగల తుట్టెను కదిలించాడు. రెండు నెలల్లో జరగనున్న నాలుగు రాష్ట్రాల శాసన సభల ఎన్నికలలో పార్టీ విజయావకాశాలు మెరుగు పరచడం, విపిసింగ్ మండల్ నినాదంతో చేస్తున్న ఉత్తర భారత యాత్రను నిర్వీర్య పర్చడం కోసం హడావుడిగా నిర్ణయం ప్రకటించినట్లున్నారు. క్రీమీలేయర్ సూచన విషయంలో సుప్రీం కోర్టు తీర్పును గౌరవించినా, మొత్తం రిజర్వేషన్ల శాతం 50 కి మించ రాదన్న సుప్రీం కోర్టు తీర్పును పట్టించు కోలేదు.

అయితే ఈ నిర్ణయమైనా అమలు జరుగుతుందా అన్నది అనుమానం. ఇది వరకటి వలె అగ్రవర్ణాలు హింసాత్మకంగా ప్రతిస్పందించవనే గ్యారంటీ లేదు. తరతరాలుగా సమాజ నిరాదరణకు గురై ఆర్థికంగానూ పతనమైన వర్గాలకు సాంఘిక న్యాయం చేకూర్చి, వారి అభ్యున్నతికి ప్రత్యేక శ్రద్ధతో కృషి చేయడం ప్రభుత్వ కర్తవ్యం: దాన్ని కాదనలేము. కాని, అదే సమయంలో కేవలం అగ్ర కులంలో పుట్టినంత మాత్రాన ఆర్థికంగా చితికి పోయిన కుటుంబాలను అణగ ద్రొక్కడం అన్యాయం. ఎప్పుడో పూర్వీకులు చేసిన తప్పుకు ఈనాటి యువతరాన్ని శిక్షించడం ధర్మ సమ్మతం కాదు. ఇప్పటికే హరిజన, గిరిజనాది వర్గాలకు 27 శాతం ఉద్యోగాలు రిజర్వు అయి వున్నాయి. మరొక 27 శాతం బీసిలకు రిజర్వుచేస్తె, అగ్ర కులాల వారి ఉపాధి అవకాశాలు మరింత తగ్గి పోతాయి. ఒకరికి న్యాయం చేసే ప్రయత్నంలో ఇంకొకరికి అన్యాయం జరిగి పోతున్నది. కేవలం ఓట్ల కోసం ప్రభుత్వాలు మండల్ నివేదికను వాడుకుంటున్నాయి తప్ప నిజంగా బీసిలపై ప్రేమ వుండి కాదన్నది సత్యం. రాజకీయ ప్రయోజనాల కోసం నిర్ణయాలు తీసుకోవడం వల్లనే ప్రజలలో వాటి పట్ల అనుమానాలు, భయాలు కల్గుతున్నాయి; ఆందోళనలను ప్రేరేపిస్తున్నాయి. రిజర్వేషన్లను అమలు చేసే ముందు, అగ్రకులాల వారిలో ఏర్పడి వున్న భయసందేహాలను పారద్రోలడానికి ప్రయత్నం చేసి వుంటే బాగుండేది.

---

# జమీన్‌రైతు

10-9-1943

4 పేజీలు 0-1-6 అణా:

### కూడులేక బెంగాల్‌లో వందల కొలది చస్తున్నారు.

"నానాటికి తీసికట్లు, నాగంబొట్లు" అన్నట్లుగా వుంది బెంగాల్ ఆహార పరిస్థితి. గత వారాంతం వరకు కలకత్తాలోను, మరికొన్ని ప్రధాన పట్టణాలలోనూ మాత్రమే, వెయ్యి మంది అన్నార్తులై, ఆలో లక్ష్మణా అని ప్రాణాలు గోల్పోయినట్లు అధికార ప్రకటనల వల్లనే తెలుస్తోంది.

ఫరీదపూర్ జిల్లాలోని మాదరీపూర్ పట్టణంలోనే, మూడు రోజులలో 65 గురు మరణించారు. చాంధపూర్, మిద్నపూర్, ఢాకా జిల్లాలలోను ఇంకెందరో మరణించు తూన్నట్లూ, అనాథ ప్రేత సంస్కారాలు విధి విరామం లేకుండా జరుగుతున్నట్లు యింకా వార్తలు వస్తూన్నాయి.

కలకత్తా నగరంలో ఐదు రోజులలో 141 మంది మరణించారు రోడ్ల మీద.

బెంగాల్ రాష్ట్రమంతటికీ యింతటి విషమ పరిస్థితి యేర్పడటానికి ప్రధాన కారణం ఆ రాష్ట్ర ప్రభుత్వ అసమర్థతయేనని కలకత్తా పౌరుల బహిరంగ సభ విస్పష్టంగా చాట గల్గింది. నేటి మంత్రి వర్గం అధికారంలోకి వచ్చింది మొదలు, ఇతర ప్రాంతాల నుంచి ఆహార పదార్థాలు దిగుమతి చేసే విషయమే ఆలోచించక, రాష్ట్రమంతటికీ సరిపడు ఆహార పదార్థాలు వున్నాయని ప్రకటించి, యింతటి విషమ స్థితిని కొని తెచ్చింది. అట్లుగాక, పెందలాడే యిల్లు చక్కపెట్టు కొని ఉన్నట్లయితే ఇంత ఘోరస్థితి సంభవించేది కాదేమో?

ఏమైనా తీరా మునించు కొచ్చిన తర్వాత మేల్కొంది ఆ ప్రభుత్వం. ఒరిస్సా రాష్ట్రంతో ఒడంబడిక చేసుకొని, 20 వేల టన్నుల ధాన్యం దిగుమతి చేసుకొంటోంది. పంజాబ్, సింధు రాష్ట్రాలు చెరి 5 వేల టన్నుల గోధుమలు పంపుతాము. కలకత్తా నగరములో ఇంత గంజైనా ధర్మాత్ములు పోయక పోతారా అని యెన్నో వందల, వేల గ్రామాల నుంచి

**50 ఏళ్ళ క్రితం ఈవారం**

ప్రాణాలు అరచేత పెట్టుకొని వస్తున్నారు. వారందరికీ అధికార, అనధికార వర్గాలు ఇంత గంజి పోస్తున్నారు. సిటీ మార్వారీ సంఘం వారు 60 వేల మందికి భోజనం యిస్తున్నారు. ఇతర ప్రాంతాల నుంచి ఆహార పదార్థాలు తెచ్చుకొనే నిమిత్తం సింధియా స్టీం నావిగేషన్ కంపెనీ వారు శ్యాంప్రసాద్ ముఖర్జీకి 7 వేల టన్నుల స్టీమర్ యిచ్చేశారు. ఇతర రాష్ట్రాలలో పత్రికల వారు విరాళాలు వసూలు చేస్తున్నారు. జన్మభూమి 43 వేలు, వందేమాతరం 50 వేలు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 50 వేలు వసూలు చేశాయి. అవన్నీ శ్యాంప్రసాద్ ముఖర్జీకి పంపి, అనధికార సహాయ సంఘం ద్వారా ఆ ప్రజలకింత గంజి పోస్తున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు

#### పెళ్లిళ్ల పురాణం

లేట్ తహశిల్దార్ of కోవూరు గారు ఎదిగిన కొడుకులను బెట్టుకొని, సంతానవతి, విద్యావతి యగు మరొక భార్యను బెట్టుకొని, తృతీయ వివాహ ముహూర్తం మద్రాసులో నిన్న 9 తేది నిశ్చయించు కొన్నాడని కోవూరు తాలూకా ఆఫీసు అంటున్నది.

బాగో ఓగో మీరే విమర్శించుకోండి.

#### జోషీ ముఠా మోసం!

ప్రజా సేవ చేయాలను వుత్సాహం కన్పరచిన ఒక నవ యవ్వనాంగిని మాటలతో బురిడీ వుచ్చి పార్టీలో చేర్చుకొని, ఆమె వంటి మీద వున్న 1500 రూ. విలువ గల నగలను పార్టీ ఫండు కంటూ కాజేయుటమే గాక, కొందరు వీరులు చెప్పరాని కృత్యాలకు సంసిద్ధమయ్యారట. భారత రమణి దేనిని ప్రాణతుల్యముగా నెంచునో, అట్టి శీలాపహరణకు ఆ దుష్టులు "ఫ్రీ లౌ" పేరుతో తయారైనందున, మానవ తియగు ఆ యువతి "మీ పార్టీ కొక సలాం" అని బయట పడ్డదట.

కమ్యూనిస్టు పార్టీ పేరుతో, కోమలుల శీలాపహరణకు తలపడ్డ ఆ తెనాలి కమ్యూనిస్టు మగధీరులెవరో?

-ఒకరు

---

# కృష్ణాపట్నం రైల్వే లైనుకు లంబాడీల బాట రెడీగా వుంది!

కృష్ణా పట్నం ఓడరేవు నుంచి నెల్లూరు వరకు రైల్వేలైను వేసేందుకు ప్రైవేట్ భూమిని సేకరిస్తున్నట్లు పత్రికల్లో వచ్చిన వార్త చదివి ఆశ్చర్యపోయాను. ఈ ప్రతిపాదన ప్రకారం నెల్లూరు వేదాయపాళెం నుంచి కాకుపల్లి, తోటపల్లి గూడూరు, వరకవి పూడి గ్రామాల మీదుగా లైను కృష్ణాపట్నం చేరుతుంది. దీని కోసం వేలాది ఎకరాలు సేకరించి, కోట్లాది రూపాయల నష్ట పరిహారం రైతులకు చెల్లించాలి. ఈ ప్రకటన చేసిన వారికి గతంలోనే రైల్వే లైనుకు స్వర్గీయ ఎ.సి. సుబ్బారెడ్డి మంత్రిగా వున్నప్పుడు వెంకటాచలం రైల్వే స్టేషన్ నుండి సర్వే జరిపించిన తెలియదేమో! ఈ సర్వేలో ప్రైవేట్ భూమి అవసరం లేకుండా ప్రభుత్వ సరిపోయే మార్గ ముందని తేలింది. బ్రిటిష్ కాలంలో లంబాడీలు తమ జీవనార్థం కృష్ణ పట్నం నుంచిఉప్పును గాడిదల పై వేసుకొని వెంకటాచలం మీదుగా కడప వరకు సాగి పోయేవారు. పొలాలలో వారు నడిస్తె ఇటు రైతులకు అటు వారికి ఇబ్బంది లేదుర కావడంతో, అనాటి ప్రభుత్వం వారి కోసం కడప వరకు ఒక బాట ఏర్పర్చింది. వీరు మజిలీ చేసే గ్రామం పేరు గాడిదల వాగుగా కూడా రికార్డుల్లో నమోదై వుంది. నారికేళ వలి గ్రామ రికార్డులో లంబాడిలు దిగుమజిలీ అనే పేరున పోరంబోకు భూమి కూడా వుంది. ఈ మార్గంలోని భూమంతా ఇప్పటికీ ప్రభుత్వ ఆధీనంలో వుంది. కాని ఈ విషయాన్ని [illegible]గువలో పట్టించు కోవడం లేదు. [illegible] అనుకూలమైన [illegible] భూములను కొనడం వల్ల [illegible] ధనం నష్టమవడమే గాక వేల టన్నుల ధాన్యం దిగుబడి త[illegible] పోతుంది.

**జనవాణి**

ఘనత వహించిన పాలకులు ఈ విషయం పరిశీలించ మనవి.

—యరబోలు ఆదిశేషయ్య

గాడిదలవాగు

### కొండ మీద గుండు

ఎయిడ్స్ వ్యాధి నిరోధించను, తిరుమలలో గుండుకు ఒక్క రూపాయి టిక్కెట్టు పెట్టి 'బ్లేడు' వుపయోగించే ప్రతిపాదన వున్నట్లు టి.టి.డి. పాలక వర్గం ఛైర్మెన్ చెబుతున్నారు. ఎయిడ్స్ మాట దేవుడెరుగు, ముందు భక్తులను క్షురకుల గాట్ల బారి నుండి తప్పించండి మహాప్రభో. పెరుకు తలనీలాలు తీయడం వుచితం కాని, ఐదు రూపాయలు లంచం ఇస్తె గాని పని మొదలు పెట్టడం లేదు. ఈ కథా కమామీషు చూస్తుంటే తలనీలాలు వేలం వేసే దాని కన్నా ఎక్కువ మొత్తం క్షురకులే సంపాదిస్తున్నారు. అందువల్ల ఛైర్మెన్ గారు తల నీలాలు తీసేందుకు 5 రూపాయలు టిక్కెట్ పెట్టినైనా భక్తులనుంచి లంచం డిమాండ్ చేయకుండా క్షురకుల పై తగిన చర్యలను తీసుకోండి. దేశమంతా అవినీతి మయమే; కాని పుణ్యక్షేత్రంలో నైనా పవిత్రత మంట కలసి పోకుండా కొన్ని ఖచ్చితమైన నిర్ణయాలు తీసుకోవాలి సార్!

నెల్లూరు —యద్దనపూడి సరోజిని

### దురహంకారం

ఆగస్టు 15 తేది స్వాతంత్ర్య దినోత్సం నాడు ఒక భారతీయుడ్ని లండన్‌లోని క్రీడా మైదానంలో ఒక పాకిస్తాన్ దేశస్తుడు అత్యంత కిరాతకంగా కాల్చి చంపడం దురంహకార పూరితమైన విషయం. దానికి తోడు ఆ వ్యక్తి మన జాతీయ పతాకాన్ని తగుల బెట్టను ప్రయత్నించడం శోచనీయం. పాకిస్తాన్ విషయంలో మనదేశం మెతక వైఖరి అవలంబించ బట్టే, ఆ దేశం,

కొంప 6 పేజీలో

గ్రాండ్ ట్రంకురోడ్డులో జరిగి పోతున్న ఘోరం!

# కొంచెం తారు పూయమని ఆ కాంట్రాక్టర్‌ను వేడుకోండి!

నెల్లూరు టౌనులో కలిసి వుండే గ్రాండ్ ట్రంక్ రోడ్డును నాలుగు వరుసలుగా బాగు చేస్తున్నారు. పెద్ద పెద్ద యంత్రాలు తెచ్చి రాత్రీ పగలూ తేడా లేకుండా పనిచేసి రోడ్డు వేస్తున్నారు. పోలీసాఫీసు కూడలి నుంచి కస్తూరి దేవి విద్యాలయం మీదుగా ఆర్టీసి బస్టాండ్ వరకు పని పూర్తికావస్తున్నది. ఎత్తు పల్లాలతో గుంటలు మిట్టలుగా వుండే రోడ్డు బాగుపడడం సంతోషదాయకమే. కాని, ఆ రోడ్డు వేస్తున్న తీరు చూస్తుంటే మాత్రం బాగుపడబోయేది రోడ్డా? లేక దాన్ని వేస్తున్న కాంట్రాక్టరా అన్న సందేహం కలుగుతోంది. కాంట్రాక్టు అగ్రిమెంటు నిబంధన లేమిటో, ఎంత కంకర, ఎంత తారు వాడాల్నో, ఎంత మందం లేయర్ వేయాల్నో మాకు తెలియదు. కాని, వేసిన వేస్తున్న రోడ్డు చూస్తే మాత్రం ఆ రోడ్డు నాలుగు నెలలైనా వుంటుందన్న నమ్మకం కల్గడం లేదు. మట్టి మశానం నిండిన కంకరను కనీసం జల్లెడ కూడా పట్టకుండా పని చేస్తున్నారు. యంత్రాలే వాడుతున్నప్పటికీ, ఆ కంకరకు తారు అంటడం లేదు. కంటి తుడుపుకు తారు పైపైన చల్లి, రోలర్‌తో తొక్కించేస్తున్నారు. సగం రాళ్లు తెల్లగా వుంటున్నాయి. రాయికి రాయికి మధ్య సందులు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. రోడ్డు ఎగుడు దిగుడులను ఏ మాత్రం సరి చేయడం లేదు. ప్రక్కరోజు చూస్తే, కొత్తగా వేసిన రోడ్డుకు పాతరోడ్డుకు

## నెల్లూరు సంగతులు

తేడా తెలియడం లేదు. ఎవరైనా చెప్తేతప్ప నిన్ననే ఇక్కడ కొత్త రోడ్డు వేశారని తెలుసుకో లేరు. ఆ పద్ధతిలో రోడ్డు వేస్తే అది ఎంత కాలం నిలుస్తుంది? రానున్నది వానాకాలం – నాలుగు చినుకుల వాన పడితే పెచ్చులు, పెచ్చులుగా వూడి పోవడం ఖాయం. రోడ్డు కోసం కేటాయించిన కోట్లాది రూపాయల నిధులు ఖర్చయి పోతాయి; కాంట్రాక్టరు, ఇంజనీర్లు ఖుషీగా వుంటారు; ఆ రోడ్డు మాత్రం అధ్వాన్నమై పోతుంది. ఎక్కడో వూరికి దూరంగా ఇటువంటి కక్కుర్తి పనులు జరిగితే సహించవచ్చు. కాని టౌను నడిబొడ్డులో, అన్ని రకాల అధికారులూ రామందారిగా తిరిగే ప్రదేశంలో అంత పల్చగా తారు లేని, మట్టి ముద్దల వంటి కంకరతో రోడ్డు వేస్తున్నారంటే చూసేవారి కడుపు మండిపోతున్నది.

అయ్యా, మహా ఘనత వహించిన ఇంజనీరు దొరవార్లూ– కాసింత తారైనా వాడేటట్లు కాంట్రాక్టరు కాళ్లు, గడ్డాలు పట్టుకొని బ్రతిమలాడి వప్పించండి – మీకు పుణ్యం వుంటుంది.

### కాళిదాస కవిత వర్ణింప శక్యమా!

సాహిత్య సదస్సు గుర్రం సుబ్రహ్మణ్యం స్మృత్యంకంగా 4 తేది టౌన్ హాల్‌లో కాళిదాస జయంతి సభను ఘనంగా జరిపింది. సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్ష స్థానమలంకరించడంతో సభకు హుందాతనం మొచ్చింది. శ్రీ సుబ్రహ్మణ్యం కాళిదాసు దృశ్య, శ్రావ్య కావ్యాలను తెలుగులో అనువదించిన

కొరవ 8 పేజీలో

## సణుగుడు

### పీపుల్స్‌వారా? పీపుల్స్‌తో వారా?

పీపుల్స్‌వారా? పీపుల్స్‌తో వారా? ప్రజా యుద్ధమా లేక ప్రజలతో యుద్ధమా? రెండింటి మధ్య తేడా ఒకే ఒక్క అక్షరం. అంత స్వల్ప తేడా వున్నప్పుడు ఇదైనా, అదైనా ఒక్కటేనను కున్నట్లున్నారు నక్సలైట్లు. తెలంగాణాలో జరుగుతున్నదిదే.

నక్సలైట్లు ప్రజలకెప్పుడో దూరమై పోయారు; తమంతట తాముగా దూరంగా జరిగిపోయారు. వారి ఆలోచనలు మారి పోయాయి, ఆశయాలు మారి పోయాయి, సిద్ధాంతాలు మారి పోయాయి లక్ష్య సాధనకు మార్గాలూ మారి పోయాయి. ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిజం చెందుతున్న పరిణామాలను వారు పట్టించు కోవడం మానివేశారు. ఆచరణలో కమ్యూనిజం ప్రజలకెంత మేర వుపయోగ పడిందో తెలుసు కోవడం మానివేశారు. వర్గరహిత సమాజ స్థాపన, అందుకోసం వర్గ పోరాటం, దానికి ప్రతిబంధకంగా నిల్చే వర్గ శత్రు నిర్మూలనం, పీడించే వారి నుంచి పీడితులకు, పాలకుల నుంచి పాలితులకు రక్షణ, విముక్తి వగైరా వగైరా పదాలు, పంథాలు చద్ది మూటలై పోయాయి. ఇప్పుడు నక్సలైట్లకు తెలిసిందల్లా చంపడం, చావడం; విధ్వంసం, వినాశనం; ఎవర్ని ఎవరు ఎందుకు చంపుతున్నారో తెలియదు; ఎవరు ఎవరి చేతిలో ఎందుకు చస్తున్నారో తెలియదు; కారణం లేకుండా కన్పడిన ఆస్తినంతా ధ్వంసం చేయడం ద్వారా సాధించే ప్రయోజనమేమిటో తెలియదు. అంతా అయోమయం, గందర గోళం.

తెలంగాణాలో ఈ మధ్య నక్సలైట్లు కాల్చి బూడిద చేసిన, బాంబులు పెట్టి పేల్చి పారేసిన ఆస్తి

డోలేంద్ర

పాస్తుల లెక్కలు తీస్తే ఎన్ని కోట్లుంటాయో చెప్పలేము. రైల్వే స్టేషన్లు, టెలిఫోన్ ఎక్చేంజిలు, కోర్టు భవనాలు, సహకార పరపతి సంఘాల ఆస్తులు, పంచాయితీ బిల్డింగులు, బస్సులు, రైలు పెట్టెలు.... ఒకటేమిటి? ఏది కన్పడితే అది, ఏది అడ్డు వస్తే అది తగుల బెట్టేయడమే. వెనుకా ముందు ఆలోచనే లేదు.

కొరవ 6 పేజీలో

# "నూరేళ్లు నిండిన" లోకో షెడ్!

## అధికారులకు కాలక్షేపం లేదనే ఈ కోట్ల రూపాయల ఆస్తిని పాడు పెట్టారా?



బిట్రగుంట లోకో షెడ్ చరిత్రలో కలిసి పోతున్నది; పురావస్తు శాఖ పదిల పరచేందుకు అనువుగా శిధిలమౌతున్నది. నూరేళ్ల పాటు నిత్యశోభితమై, నవనవ లాడుతూండిన ఆ రైల్వే పారిశ్రామిక కేంద్రం పాడు పడి పోతున్నది. దానికి నూరేళ్లు నిండడంతోనే, నూరేళ్లూ నిండిపోయాయి. దానికి వయస్సైతే దానంతటది వచ్చింది కాని, చావు మాత్రం అట్లా ఖాలేదు. జిల్లా నాయకులు, రైల్వే అధికారులు కలిసి బలవంతంగా గొంతు పిసికి చంపుతున్నారు. తిరిగి లేవకుండా సమాధి చేస్తున్నారు. జిల్లా ప్రజలకు అన్యాయం చేస్తున్నారు.

ఎప్పటిది షెడ్?

... నడక నేర్చుకుంటున్న సమయంలో, 1881 మే నెల 1 తేది పురుడు పోసుకున్నదది. రైల్వేలకు అవసరమైన రవాణా, సాంకేతిక వస్తువుల ఉత్పత్తి లక్ష్యంగా బ్రిటీషు ప్రభుత్వం దీనిని ప్రారంభించింది. విజయవాడ, మద్రాసుల మధ్య అనుకూలమైన ప్రదేశంగా గుర్తించి, ఇంగ్లీషు దొరలు బిట్రగుంటను ఎంపిక చేశారు. మద్రాసు సదరన్, మహారాష్ట్ర రైల్వేలకు కావలసిన అన్ని అవసరాలూ ఈ లోకో షెడ్ తీర్చేది. ఆ రోజుల్లో దేశంలో అతి పెద్ద లోకో షెడ్లలో బిట్రగుంటకు రెండవ స్థానం సంక్రమించింది. 85 సంవత్సరాల పాటు రైల్వేలతో పాటు ఇది క్రమానుగతంగా అభివృద్ధి చెందింది. అరుదైనకళను సంతరించుకున్నది ... 1966 సంవత్సరంలో దీన్ని దక్షిణ మధ్య రైల్వే విభాగంలో విలీనం చేశారు. అనాటికి ఇక్కడ 1500 మంది రైల్వే కార్మికులు రేయింబవళ్లు పనిచేసే వారు. స్టీమ్ ఇంజన్ల శబ్దం మూడు నాలుగు కిలో మీటర్ల పరిధిలో ప్రతిధ్వనించేది.

**రైలింజన్లతో బొమ్మలాట లాడిన బిట్రగుంట లోకో షెడ్ ఇప్పుడు శిథిలాలయం వలె మిగిలిపోయింది; కోట్ల విలువైన యంత్రాలను పాత ఇనుము క్రింద చవకగా అమ్మేస్తున్నారు.**

ఈ లోకో షెడ్‌లో ఒక సారి 43 స్టీమ్ ఇంజన్లను నిలిపి, రిపేరు చేసే సౌకర్యం వుండేది. 23 చోట్ల ఇంజన్ల అండర్ గేర్సును మరమ్మత్తు చేసే వసతి వుండేది. మరమ్మత్తు అనంతరం ఇంజన్లను ఒక ట్రాక్ నుంచి మరొక ట్రాక్‌కు మార్చేందుకు టర్న్ టేబుల్ వుండింది. వర్క్‌షాపుకు ఇంజన్లను అట్లట్లనే తరలించే యంత్రాలుండేవి. వర్క్‌షాపులోనూ, అంత భారీ ఇంజన్లను గాలిలోకి ఎత్తి పెట్టి, రిపేర్లకు వీలు కల్పించే భారీ క్రేన్సు రెండుండినాయి. అదీ ఇదీ అని చెప్పడ మెందుకు – స్టీమ్ ఇంజన్లను బొమ్మల్లాగా ఆడించి, తుప్పు పట్టిన వాటికి ప్రాణం పోసి పట్టాల పై నడిపించే ఆధునిక రైలింజన్ల పెద్దాస్పత్రిగా వుండేది బిట్రగుంట లోకో షెడ్.

షెడ్ వుంది కాబట్టి, మద్రాసు విజయవాడల మధ్య నడిచే రైళ్లన్నింటికీ ఇక్కడ ఇంజన్లు మార్చే వారు. ఇందు కోసం 1968 లో కోటి యాభై లక్షల ఖర్చుతో మార్షలింగ్ డౌన్ యార్డ్ నెలకొల్పారు. ఇది స్టేషన్ నుంచి మూడు [illegible] మీటర్ల దూరం వ్యాపించి వుండేది. దానిలో ఎప్పుడూ పది గూడ్సు రైళ్లు నిల్చి వుంచేవారు. యార్డ్ కార్యకలాపాల కోసం హంప్ క్యాబిన్ పెట్టారు. అందులో 1400 [illegible]లు, ఇనుప స్లీపర్లు [illegible] విలువ అప్పుడే [illegible] అప్పుడైతే పాతిక కోట్ల పై [illegible] వివిధ మార్గాలలో పోవలసిన గూడ్సు వ్యాగన్లను క్రమ

కొరవ 7 పేజీలో

**నెల్లూరు సబార్డినేట్ జడ్జివారి కోర్టులో**

S.C. No. 94/92

ఇండియన్ బ్యాంకు, నెల్లూరు
రిప్రజెంటెడ్ బై ఇట్స్ మేనేజర్ వారి

Vs

Sk. బాష ప్రతివాది

To, Sk. బాష,
S/o మస్తాన్ సాహెబ్
3/831, పెద్ది గుంట రోడ్డు
నెల్లూరు టవున్ & జిల్లా

**నోటీసు**

పై నెంబరున వాది బాకీ రాబట్టు కొను నిమిత్తము మీ మీద దావా వేసి ఉన్నందున మీకు నోటీసు నిమిత్తము 28-10-1993 తేదికి వాయిదా వేసి ఉన్నారు. ఆ రోజు పగలు గం.10.30 ని.లకు మీరు పై కోర్టులో హాజరై మీ ఆక్షేపణలను తెలుపుకోనిచో ఎడల మీ పరోక్షమందు కేసు తీర్మానించబడును.

కొండూరు శేషారెడ్డి
అడ్వొకేటు, నెల్లూరు

# నెల్లూరు [illegible]

## యానాదిరెడ్డి గారికి జిల్లా పవర్ పట్టా

కొత్తమంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి గారికి నెల్లూరు జిల్లా రాజకీయపు పవర్ ఆఫ్ అటార్నీ ఇచ్చేశారట ముఖ్యమంత్రి. "పూరకే మంత్రిత్వం తీసుకోవడం కాదు, రేపు ఎన్నికల్లో పదకొండు సీట్లు గెల్పించుకొని వచ్చే బాధ్యత నీదే" అని చెప్పారట కోట్ల వారు.

అంత పెద్ద బరువును ఎట్లా మోస్తారండీ పాపం!

## పెంచలయ్య పోరాడి గెల్చాడు

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య పదవీ ప్రాణం పైలోకం వాకిలి వరకు పోయి, తిరిగి వచ్చింది. ఎందువల్లనో పెంచలయ్య అంటే సిఎంకు అంత అభిమానం లేదు. జిల్లాకు సంబంధించిన ఒకరిద్దరు ఎమ్మెల్యేలు, మరొక నాయకుడు ముఖ్యమంత్రికి పెంచలయ్యపై పలుమార్లు ఫిర్యాదులు చేసి మరింత దూరం పెంచారు. ఈ నేపథ్యంలో విజయభాస్కరరెడ్డి, తీసివేసే మంత్రుల జాబితాలో పెంచలయ్య పేరు చేర్చేశారు. జనార్దనరెడ్డికి కోపం రాకుండా ఆయనకు బదులు పట్రా ప్రకాశరావును ఎంపిక చేశారు. 7 తేది సాయంత్రం సిఎం స్వయంగా ఫోన్‌చేసి ఈ విషయం చెప్పారట. అప్పటి నుంచి మొదలైంది పెంచలయ్య పోరాటం. జనార్దనరెడ్డిని వదలకుండా పట్టేశారు. ఢిల్లీకి కూడా ఫోన్లు మ్రోగాయి. మూపనార్, జితేంద్ర ప్రసాద్‌ల జోక్యం అభ్యర్థించడం జరిగింది. జనార్దనరెడ్డి గారు సిఎంకు మళ్ళీ తనే ఫోన్‌చేసి తగిన రీతిలో నచ్చచెప్పారు. ఎంతో వత్తిడి తరువాత విజయభాస్కరరెడ్డికి మనసు మార్చుకోక తప్పలేదు. గవర్నర్‌కు వెళ్ళిన ప్రకాశరావు పేరును తొలగించి, పెంచలయ్యను కొనసాగింప జేశారు. అయితే శాఖ మాత్రం మారిపోయింది. ఇళ్లు అప్పు చెప్పారు. స్వంత ఇల్లు కూడా లేక బాడుగింట్లో బ్రతికేద్దే సమాచారం కంటే ఇళ్ల శాఖ మెరుగైనదే. పాపం ప్రకాశ రావు - లిప్‌కు, సిప్‌కు మధ్య కుప్ప స్లిప్ అయిపోయింది!

## ఆటల పోటీలు

నెల్లూరులో 11 నుంచి 15 తేది వరకు 5 రోజుల పాటు పెద్ద క్రీడోత్సవం జరుగబోతుంది. కొత్తగా కమిటీ అధ్యక్షుడైన శ్రీ ఆనం వివేకానందరెడ్డి విఆర్ కాలేజికి పూర్వ ఔన్నత్యం తెచ్చే కృషిలో భాగంగా వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అంతర్ జిల్లాల ఆటల పోటీలు ఆడంబరంగా జరిపిస్తున్నారు. గత పన్నెండేళ్లలో విశ్వవిద్యాలయం పరిధిలో గేమ్స్ స్పోర్ట్స్ కలిపి ఒకే చోట నిర్వహించడం ఎప్పుడూ జరగలేదు. ఆ అనవాయితీకి వివేకా తిరిగి శ్రీకారం చుడుతున్నారు. విఆర్‌సి గ్రౌండ్‌లో అథ్లెటిక్స్, వాలీబాల్, బాస్కెట్‌బాల్; చర్చిగ్రౌండ్స్‌లో బాడ్మింటన్, ఖోఖో; ఎసిస్టేడియంలో ఫుట్‌బాల్, హాకీ; మెక్లిన్స్ క్లబ్‌లో టేబిల్, టెన్నిస్, క్యారమ్స్ పోటీలు జరుగుతాయి. దాదాపు 500 మంది క్రీడాకారులు పాల్గొంటున్నారు. వీరందరికీ విఆర్ హైస్కూలు, లా కాలేజిలలో వసతి కల్పిస్తున్నారు.

ఆటల పోటీలకు అంతర్జాతీయ ప్రమాణాల స్థాయిలో గ్రౌండ్‌లు, కోర్టులు ఏర్పాటు చేస్తున్నామని చెప్తున్నారు వివేకానంద రెడ్డి. వాలీబాల్, బాస్కెట్ బాల్ కోర్టులకు ఫ్లడ్ లైట్లు ఏర్పాటు చేశారు. విశ్వ విద్యాలయం ఆటలకు ఫ్లడ్ లైట్ల ఏర్పాటు ఇదే ప్రథమమట. టౌన్‌లోని యువకులలో క్రీడాభిమానం పెంపొందింప జేయడానికి ఆటలు జరిగే మైదానాలలో బొమ్మలు, గిమ్మలు పెడుతున్నారు. విస్తృత ప్రచారం కల్పిస్తున్నారు. సావనీర్ విడుదల చేస్తున్నారు.

కాలేజి లెక్చరర్లు 150 మందిని, 30 కమిటీలుగా ఏర్పర్చి రాత్రి పగలు గ్రౌండ్‌లో కష్టపెట్టేస్తున్నారు. పోగ్గా కాలేజికి వచ్చి, చొక్కా మడత నలగకుండా తిరిగే అయ్యవార్లు పాపం చెమట కార్చుకుంటూ ఎండలో తిరుగుతుంటే చూడడానికి బాధేస్తున్నది. రామనారాయణ రెడ్డి కూడా గ్రౌండ్‌కె అంకితమై పోయి వున్నారు.

వైస్ ఛాన్సలర్ శ్రీ జయరామ రెడ్డి 11 తేది పోటీలు ప్రారంభిస్తున్నారు. కలెక్టరు, జె.కె. ఆనం రామనారాయణ రెడ్డి ముఖ్య అతిథులు. అథ్లెటిక్స్‌లో గెలుపొందిన వారికి జెకె రెడ్డి మెడల్స్ బహుమతిగా ఇస్తున్నారు. షీల్డులు వగైరాలు మామూలే! బహుమతి ప్రదానానికి కొత్తమంత్రి యానాదిరెడ్డి గారిని పిలవాలని వుందట. కొత్త మోజు కదా!

ఇంత ఆడంబరానికి డబ్బెక్కడిదో వివేకా చెప్పడం లేదు.

## జవహర్ భారతి 15 తేది ప్రారంభం

నీళ్లు లేక మూత పడిన కావలి జవహర్ భారతి కాలేజిని 15 తేది నుంచి పునః ప్రారంభిస్తున్నారు. ఆర్‌డిఓ గారు కాలేజి అవసరాలకు సరిపడా మంచి నీళ్లు సరఫరా చేస్తామని హామీ ఇవ్వడంతో నిరవధికంగా మూత వేసిన కాలేజి తలుపులు తిరిగి తెరుస్తున్నామని ప్రిన్సిపాల్ శ్రీ రత్నా జోసఫ్ తెలియజేస్తున్నారు. పిల్లలందరూ బుధవారానికి కావలికి చేరుకోవచ్చు.

## కసుమూరు ఉరుసు

కసుమూరు ఉరుసు 13 తేది జరుగనుంది. 13 తేది సోమవారం రాత్రి గుర్రం పై గంధం ఊరేగిస్తారు. 14 తేది ఉదయానికి ఆ ప్రదర్శన దర్గా చేరుతుంది. భక్తులకు గంధం పంచుతారు. 15 తేదితో ఉత్సవం ముగుస్తుంది. ఈసారి ఏర్పాట్లు బాగా చేస్తున్నామని చెప్తున్నారు దర్గా నిర్వాహకులు. నెల్లూరు నుంచి ఆ మూడు రోజులూ రాత్రి, పగలు ఆర్‌టిసి బస్సులు నడుస్తాయి.

## వెంకయ్య స్వామికి కోర్టు నిషేధం

గొలగమూడి వెంకయ్య స్వామి కోర్టు గడప ఎక్కాడు. ఆశ్రమ నిర్వహణలో అవకతవకలు పెరిగి పోయాయని ట్రస్టు సభ్యులే కోర్టుకు వెళ్లారట. దాని పై అడిషనల్ జిల్లా జడ్జి గారు ఆశ్రమ హుండీలను తెరవ డానికి లేదని, బ్యాంకుల్లోని నిధులు విత్ డ్రా చేయడానికి లేదని నిషేధం విధించి కేసు విచారణకు స్వీకరించారు.

వెంకయ్య స్వామిది అదేమి మహత్మ్యమో గాని అమాయక ప్రజలు లక్షలకు లక్షలు విరాళాలుగా ఇస్తున్నారు. వాటిని సద్వినియోగం చేస్తే ఆశ్రమమేమి ఖర్మ - మొత్తం గొలగమూడి గ్రామం రూపు రేఖలే మార్చి పారేయవచ్చు. కాని దేముడి పేరుతో వచ్చే సొమ్ము ఎక్కడ సద్వినియోగం అవుతున్నది చెప్పండి?

## టివిలో నెల్లూరు కళాకారులు

హైదరాబాద్ దూరదర్శన్ ఇటీవల ప్రసారం చేసిన భక్తి-ముక్తి కార్యక్రమంలో నెల్లూరు కళాకారులు శ్రీమతి రాళ్లపల్లి సుబ్బులక్ష్మి, కుమారి రాళ్లపల్లి గాయత్రి, శ్రీమతి అనూరాధ, కనకదుర్గ, శ్రీ అద్రా కృష్ణమూర్తి, రాఘవేంద్ర స్వామి భక్తి గీతాలు ఆలపించారు. నెల్లూరులో ఇంత మంచి గాయనీ మణులున్నారా అన్పించింది శ్రీమతి సుబ్బలక్ష్మి గాత్రం వింటే!

## బంద్ విఫలం

కేంద్ర ప్రభుత్వ ఆర్థిక విధానాలకు నిరసనగా వామ పక్షాలు తలపెట్టిన భారత్‌బంద్ (9 తేది) నెల్లూరులో దాదాపు విఫలమైంది. ఉదయం పది గంటల వరకు అంగళ్లు మూయించిన కార్యకర్తలు ఆ తర్వాత అదృశ్యమై పోయారు. పన్నెండు గంటల నుంచి మామూలు ప్రజా జీవనం ప్రారంభమైంది. బస్సులూ తిరిగాయి. రైళ్లు నడవలేదు. బ్యాంకులు తదితర సంస్థలకు సెలవు ప్రకటించారు.

బంద్ అంటేనే చిరాకేస్తున్నదండీ!

## రోడ్డు ప్రమాదం ముగ్గురి మృతి

దొరవారి సత్రం సమీపంలో అక్కరపాక, పోలిరెడ్డి పాళెం మధ్య జాతీయ రహదారి పై 4 తేది వేకువ

**In the Court of the I Additional District Judge, Cuddapah**

O.P. No. 95 / 93

E. Esthar Rani & Others - Petitioners

Vs.

1. T. Venkateswara Rao
2/ 284, Gandla Street, Nellore

- Respondent No. 1

పై దావా నందు వాది Compensation కొరకు పై కోర్టులో దావా దాఖలు చేసి యున్నారు. సదరు వాయిదా 16.9.93 తేదికి వున్నది. కావున తమరు పై దావా రోజున పై కోర్టు నందు ఉదయం 10.30 గంటలకు హాజరై మీ ఆక్షేపణలు తెలుపు కోవలసినది. లేని యెడల మీ పరోక్షములో దావా తీర్మానించ బడును.

**A. Seetha Ram**

Advocate for Petitoners

**In the Court of the Prl. Sub Judge of Chittoor.**

O.P. No. 65 of 1992

Between:

A. Devarajulu Reddy - Petitioner

and

Megalavathi alias Chittemma alias Chinna Papa and another - Respondents

**NOTICE**

To.

1. Megalavathi alias Chittemma alias Chinna Papa D/o. Krishna Reddy, Korla Gunta, Tirupathi Town, Chittoor District.
2. Subrahmanyam, S/o. Govindaswamy, Mason, Korlagunta, Tirupathi, Chittoor District.

Sirs,

Please take notice that the above case stands posted to 27.9.1993 for your appearance. If you got any objection, you can appear either in person or through an advocate on the above said date at 10.30 a.m. failing which the matter will be decided exparte.

Date: 24.8.1993

Place: Chittoor

**T. Puroshotham,**

Advocate for Petitioner

**నెల్లూరు III అ.డి.ము. కోర్టులో**

O.S. No. 629 / 92

Vijaya Bank, Nellore represented by its Manager -వాది

పరికూటి వెంకమ్మ -ప్రతివాది

To

పరికూటి వెంకమ్మ, W/o. శేషు కొండాయపాళెం, నెల్లూరు

నోటీసు

పై నెంబరున వాది దావా మొత్తం రూ. 11550.00 లున్ను, దావా ఖర్చులున్ను, రాబట్టు కొను నిమిత్తం దావా చేసి యున్నారు. నీకు గల ఆక్షేపణలను 29.9.93 తేది పగలు 10 గంటలకు పై కోర్టుకు హాజరై తెలుపు కోవలసినది. లేని యెడల మీ పరోక్షమందు తీర్మానించ బడును.

**S.V. Sarma**

Advocate for Plaintiff

**గూడూరు డి.ము.కోర్టులో**

S.C. No. 94/92

పినాకిని గ్రామీణ బ్యాంక్, గూడూరు -వాది

Vs

తల్లి నరసయ్య శెట్టి, S/o. అరివేలు శెట్టి, గూడూరు -ప్రతివాది

నోటీసు

వాది మీ పై లోను బాకీ రాబట్టు నిమిత్తం పై కోర్టులో దావా వేసి ఉన్నది. దావాను కోర్టు వారు 23.9.93 వ తేది, మీ నోటీసు నిమిత్తం వాయిదా వేసినారు. మీకు ఆక్షేపణలు ఉన్నయెడల, మీరు గాని, మీ తరపున వకీలు ద్వారా గాని అభ్యంతరములు తెలుపుకో వలసినది. లేనిచో మీ పరోక్షముగా తీర్మానించెదరు.

**పి.వి. సాయికుమార్ రెడ్డి**

వాది తరపున న్యాయవాది

**In the Court of the I Additional District Judge, Cuddapah**

O.P. No. 94 / 93

E. Esthar Rani & Others - Petitoners

Vs

1. T. Venkateswara Rao
2/ 284, Gandla Street, Nellore

- Respondent (No. 1)

పై దావా నందు వాది Compensation కొరకు పై కోర్టులో దావా దాఖలు చేసి యున్నారు. సదరు వాయిదా 16.9.93 తేదికి వున్నది. కావున తమరు పై దావా రోజున పై కోర్టు నందు ఉదయం 10.30 గంటలకు హాజరై మీ ఆక్షేపణలు తెలుపుకోవలసినది. లేని యెడల మీ పరోక్షములో దావా తీర్మానించ బడును.

**A. Seetha Ram**

Advocate for Plantiff

## సణుగుడు

(4 పేజీ తరువా)

ఆగస్టు 25 నుంచి సెప్టెంబరు 1 తేది మధ్య నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలలో నక్సలైట్లు రెండు రైల్వే స్టేషన్లు, రెండు టెలిఫోన్ ఎక్స్ఛేంజిలు, బాంబులు పెట్టి పేల్చి వేశారు. తమ తోటి నక్సలైట్లు ఇద్దర్ని పోలీసులు అరెస్టు చేశారనే అనుమానంతో ఈ విధ్వంస కాండకు పాల్పడ్డారు. వారిని అరెస్టు చేయలేదని పోలీసు చెప్పింది; సాక్షాత్తు పీపుల్స్ వార్ రాష్ట్ర కార్యదర్శి నల్లా ఆదిరెడ్డి వారిద్దరూ అరెస్టు కాలేదని ప్రకటించారు. అయినా జిల్లా కామ్రేడ్‌లు పట్టించుకోలేదు. తమ విధ్వంస కాండ ఆపలేదు. దీన్ని బట్టి అర్థమౌతున్న దేమిటి? పీపుల్స్ వార్‌కు తమ కార్యకర్తల పైనే అదుపులేదు. ఎవరికి వారు నిర్ణయం తీసుకొని ఎవర్ని బడితే వారిని చంపడం, విధ్వంసం చేయడం జరుగుతున్నా ఆపగల్గే స్థితిలో నాయకత్వం లేదు. చావులకు, చంపడాలకు సిద్ధాంత ప్రాతిపదిక లేదు. కేవలం వదంతుల ఆధారంగా కోట్ల రూపాయల ఆస్తి బుగ్గిపాలైంది. ఆ నష్టం ఎవరిది? ప్రజలది కాదా? మారు మూల గ్రామాలలో రైల్వేస్టేషన్లు, టెలిఫోన్ ఎక్స్ఛేంజిలు ధ్వంసం చేస్తే ఇబ్బంది పడేదెవరు? ప్రజలు కాదా? అంతా అయిపోయాక నక్సలైట్లు తమ పొరపాటుకు చింతిస్తూ ఒక ప్రకటన చేశారు. కాని ఆ పొరపాటు వల్ల రవాణా, సమాచార సౌకర్యాలు కోల్పోయిన సామాన్య ప్రజలకు ఎవరు పరిహారం చెల్లిస్తారు?

ఇంకొక చోట నక్సలైట్లు, అమాయక గిరిజనులను ప్రోత్సహించి, తాము వెనుక వుండి ఒక గ్రామాన్ని దోపిడీ చేయించారు. గిరిజనుల జీవితాలలో చైతన్యం తేవలసిన నక్సలైట్లు చేయవలసిన పనేనా ఇది?

పీపుల్స్ వార్ దారి తప్పి పోతున్నది. దాని వల్ల నష్టపోయేది ఆ ఉద్యమమే కాదు, ప్రజలు కూడా! రచయితలు, అధ్యాపకుల వంటి మేధావి వర్గాలతో సంపర్కం తెంచుకొని, కేవలం అడవులకే పరిమితమై పోయి ఆటవిక విధానాలతో విప్లవోద్యమం నడప గలమనే భ్రమలో వున్నారు వారు. ఈ భ్రమలు తొలగించే వారెవరూ లేరా?

## సాందాయమ్మ

(2 పేజీ తరువా)

సాందాయమ్మ సేకరించిన పిల్లలలో అధిక భాగం తండ్రిలేని అభాగ్యులు. అక్రమ సంతానమో లేక వ్యభిచారిణుల పిల్లలో అయి వున్నారు. వారు ఎట్టి పరిస్థితులలో బయటపడి వివరాలు చెప్పరన్నది ఆమె ధైర్యంగా కన్పిస్తుంది. ఎంతమంది పిల్లలు నాపై ఫిర్యాదు చేయగలరు చెప్పండి అని ఆమె ప్రశ్నించ గల్గడంలోని అంతర్యం అదే.

అనాథలు అభాగ్యుల దైన్య పరిస్థితిని వ్యాపారంగా మార్చుకోవడంలో సాందాయమ్మ ఆరితేరిన నిపుణురాలని నమ్మకంగా చెప్పవచ్చు. ప్రాణం వున్న తోలు బొమ్మల్లాగా ఆమె పిల్లలతో ఆటలాడిందన్నది నిజం. విచిత్ర మేమిటంటే నాలుగు నెలల నుంచి ఈ రగడ జరుగుతుంటే ఇప్పటికి పోలీసు దర్యాప్తు ఒక్క అంగుళం ముందుకు సాగలేదు; ఒక్క నిజం బయటకు రాలేదు. కనీసం కంటి తుడుపు కోసమైనా ఏ అధికారీ సాందాయమ్మను విచారించలేదు. కలెక్టర్ జోక్యం కూడా నిష్ఫలమైంది. సాందాయమ్మ చేసింది తప్పో ఒప్పో విచారణ జరిపితే కాని తెలదు; విచారణే చేయకుండా ఆమెను నిర్దోషిగా పోలీసు ప్రచారం చేయడం ఘోరం.

సాందాయమ్మను అరెస్టు చేయాలని, కేసును నిష్పక్షపాతంగా విచారణ జరిపించాలని స్త్రీ విముక్తి సంఘం ఆందోళన చేస్తున్నది. 6 తేది వారు జాయింట్ కలెక్టర్‌ను ఘెరావ్ చేశారు.

— అల్లూరు రహీం

## జనవాణి.

(3 పేజీ తరువా)

దేశస్థులు మరీ పెట్రేగి ప్రవర్తిస్తున్నారు. ఈ సంఘటనలను మన దేశం తగిన రీతిలో ఖండించక పోవడం శోచనీయం.

నెల్లూరు -స్వరూప్

### శ్రీసాయిబాబా - రమణ మహర్షి

సాయిబాబా దేముడూ, రమణ మహర్షి రక్షకుడూ అనీ; మరి ఏడు కొండల వాడు ఏమైనట్లు? అని చమత్కారంగా శ్రీ శివారెడ్డి వ్రాశారు. బాగానే వుంది. చిన్న క్లారిఫికేషను.

శ్రీ షిర్డి సాయిబాబా, శ్రీ రమణ మహర్షి సద్గురువులు. సద్గురువు భగవంతుని కన్నా అధికుడని శ్రీ గురుగీత వక్కాణిస్తున్నది. సర్వదేవతలూ శ్రీ సద్గురువులోనే సృష్టించ బడుతున్నారు. ప్రకటిత మవుతున్నారు లయ మవుతున్నారు.

శ్రీ శివారెడ్డి గారిని ఇంకా సులభ భాషలో ప్రతివారం వేదాంతం మీద రెండు పద్యాలు వ్రాయమని అభ్యర్థన.

తడ -వి. రామచంద్ర రావు

## నెల్లూరు ముచ్చట్లు

(5 పేజీ తరువా)

వాముని ఘోరమైన రోడ్డు ప్రమాదం జరిగింది. ప్రమాదంలో ముగ్గురు వ్యక్తులు మరణించగా 9 మందికి గాయాలయ్యాయి; 50 మూగజీవాలైన మేకలు, గొర్రెలు ప్రాణాలు కోల్పోయాయి. మద్రాసుకు బొగ్గు లోడతో పోతూ రోడ్డు పక్కన ఆగి వున్న లారీని మేకలు, గొర్రెల లారీ వచ్చి ఢీ కొట్టింది. మేరం రామన్న (5)), దేవమస్తాన్ (52), ఎన్నిటి ఏడుకొండలు (30) అనే గొర్రెల వ్యాపారులు మరణించిన వారిలో వున్నారు. మిగతా వారిని పరిస్థితి ఆందోళన కరంగా వుండడంతో మద్రాసు ఆసుపత్రికి తరలించారు.

### యువ సంగీత నృత్య మహోత్సవాలు

దక్షిణ మధ్య సాంస్కృతిక కేంద్రం టౌన్‌హాలులో 3 తేది నుండి 6 తేది వరకు నిర్వహించిన యువ సంగీత నృత్య మహోత్సవాలు రస పిపాసులైన సింహపురి ప్రజలను అలరించాయి.

ముఖ్యంగా గాత్ర సంగీతంలో మైసూరుకు చెందిన వాణీ, సతీష్, ధార్వార్‌కు చెందిన గాయత్రి జోషి ప్రేక్షకులను మంత్ర ముగ్ధులను చేశారు. ధార్వార్‌కే చెందిన షఫీక్ ఖాన్ సితార వాదన సమ్మోహన పరిస్తే డి.ఎస్. ఉష భరత నాట్యం బ్రహ్మాండంగా ఆకట్టుకొంది. హార్మోనియంలో రవీంద్ర కహాటి; మృదంగంలో అనేకల్ చక్కని ప్రతిభ చూపారనవచ్చు. ఓ సరికొత్త కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన నిర్వాహకులు అభినందనీయులు.

# కట్టి ఐదేళ్లయినా ఖాళీగా వుంటున్న రాపూరు సబ్ జైలు

జిల్లా కేంద్రంలోని జైలు ఖైదీలు పట్టక కిటకిట లాడి పోతుంటే, రాపూరులో కట్టిన సబ్ జైలు కొత్త కరుకు మాయకుండాకనే కళ లాడి పోతున్నది. ఐదేళ్ల క్రితం రాపూరులో సబ్‌కోర్టు పెడుతున్నట్లు ఉత్తర్వులు జారీ అయ్యాయి. రాపూరు, సైదాపురం, పొదలకూరు, డక్కిలి మండలాలు ఈ కోర్టు పరిధిలోకి వస్తాయని ప్రకటించారు. కోర్టు పెడుతున్నారు కదా అని శిక్షలు వేసిన వారి కోసం జైలు నిర్మించేందుకు నిధులు మంజూరై పోయి చక చకా పనులు జరిగి నిర్మాణం కూడా నాలుగేళ్ల క్రితమే ముగిసింది. కాని వ్రతం పూర్తయి ఫలితం దక్కనట్లు ఇంత వరకు కోర్టు పెట్టిన పాపాన పోలేదు. వృధాగా వున్న కొత్త భవనం ఎవరుండ గలరు వుపయోగించు కోకుండా చెప్పండి. చీకటి కార్యకలా పాలకు రాత్రుళ్లు, మరుగు దొడ్డిగా పగలు ప్రస్తుతం వినియోగించు కొంటున్నారు అధికారులు వ్యవహరించక, కోర్టు పెట్టక, జైలు నిర్మించే వుంటే లక్షలాది రూపాయలు సొమ్ము వృధా కాకుండా వుండేదేమో!

## వెంకటగిరిలో ఇన్‌ఛార్జీల పాలన

ఘనత వహించిన వెంకటగిరిలోని పలు కార్యాలయాలకు అధికారులు లేక ఇన్‌ఛార్జీల పాలనలో




వెల వెల బోతున్నాయి. గత సంవత్సరం నుండి మండలాభివృద్ధి అధికారి లేక పోవడంతో డక్కిలి ఎం.డి.ఒ. ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తున్నారు. ఒకే అధికారి రెండు కార్యాలయాలకు ప్రతి రోజూ హాజరు కావడం కష్టంగా వుండడంతో దినసరి కార్యక్రమాలతో పాటు

కొరవ 8 పేజీలో



అంతర కాలేజిల ఆటల పోటీలకు ముస్తాబౌతున్న వి.ఆర్ కాలేజి మైదానం

# కావలి సినిమా హాళ్లను ఆర్‌డిఒ ఆటాడిస్తున్నారు?

కావలి ఆర్డీవో శ్రీమతి వాణీ శంకర్ అంటే డివిజన్‌లోని సినిమా హాళ్ల యజమానులు హడలి చస్తున్నారు. గత పదిహేను రోజులుగా రోజుకో సినిమా హాల్ వున్న గ్రామం పోతూ, అక్కడి హాళ్లను సందర్శిస్తూ వాటిలోని పరిస్థితులను, కలెక్షన్ ఆధారంగా కట్టే పన్నులను చూసి విస్తుపోయి, చాలా హాళ్ల రికార్డులను సీజ్ చేశారు. అదనంగా వున్న సీట్లను తీసి వేయించారు. కొత్త ఫ్యాన్లు వేయమని ఆదేశించారు. నాలుగు ఆటలు వేసి రెండు ఆటలుగా డైలీ కలెక్షన్ రిపోర్టులో చూపితే తగిన చర్యలు తీసుకొంటానని హెచ్చరించారు.

ఆ తర్వాత ఆమె డివిజన్‌లోని సినిమా హాళ్ల యజమానులతో ఒక సమావేశం ఏర్పాటు చేసింది. సమస్యలు ఏదో చెప్పాలి కదా అని డిష్ యాంటిన్నాలు, కేబుల్ టి.వి.లు తమను నష్టాల పాలు చేస్తున్నాయని వాపోయారట థియేటర్ యజమానురాలు. ఇదే నిజమైతే పత్రికల్లో ప్రకటించే కోట్లాది రూపాయల రికార్డు బ్రేక్ కలెక్షన్లు [illegible] వస్తాయండి? [illegible] మంచినీళ్లు ఏర్పాటు చెయక పోవడం, ఫ్యాన్లు ఆట మధ్యలో ఆపివేయడం, అదనపు కుర్చీలు, కాలు పెట్టలేని [illegible]రుగు దొడ్ల గలీజుకు కారణాలు మాత్రం ఒక్కరూ ప్రస్తావించ లేదట. మొత్తానికి అన్నీ ఓపిగ్గా విన్న ఆర్డీవో, నిబంధనలకు నిల్లొడిలితే వూర్కొనేది లేదని ఖరాఖండిగా చెప్పారు. కావలి ఆర్డీవో చూపిన ఈ చొరవ జిల్లాలోని ఇతర అధికారులూ చూపితే ప్రజలు ఎంత సౌలభ్యంగా సినిమాలు చూడవచ్చో?

## గుమ్మళ్ల దిబ్బలో వుచిత వైద్య శిబిరం

కోవూరు మండలం గుమ్మళ్ల దిబ్బ గ్రామంలో సేవా భారతి సంస్థ 20 తేది వుచిత వైద్య శిబిరాన్ని నిర్వహించింది. నెల్లూరు జయభారత్ హాస్పటల్‌లోని వైద్య బృందం ఓపికగా రాత్రి 7 గంటల వరకు 300 మందికి పైగా రోగులను పరీక్షించి వైద్య సలహాలతో పాటు వుచితంగా మందులు పంపిణీ చేశారు. శిబిరంలో డాక్టర్ జనార్ధన్, డాక్టర్ నరసింహా రావుతో పాటు లేడి డాక్టర్ ప్రేమలత పాల్గొన్నారు. సంస్థ 29 తేది శనివారం పాటూరు గ్రామంలో కూడా వుచిత వైద్య శిబిరం నిర్వహిస్తున్నట్లు డాక్టర్ జనార్ధన్ తెలిపారు.

# జిల్లా నాయకులు దద్దమ్మలై ఈ దుర్గతి దాపురించింది!

పద్ధతిలో సర్దు బాటు చేయడం యార్డ్ కార్యకలాపం.

స్టీమ్ ఇంజన్ల కవసరమైన బొగ్గు కోసం ఆరు బంకర్లు నెలకొల్పారు. 2630 చదరపు మీటర్ల విస్తీర్ణంలో కోటి యార్డ్ వుండేది. బొగ్గును రైళ్లలో, బంకర్లలో నింపేందుకు 45 టన్నుల సామర్థ్యం కల్గిన గోలియత్ క్రేన్ వుండేది. కరెంట్ సరఫరా కోసం 33 కెవి సబ్ స్టేషన్, అంతే సామర్థ్యం కల్గిన డీజల్ జనరేటర్ ఏర్పాటు చేశారు.

స్టీమ్ ఇంజన్లకు నీటి సరఫరా కోసం రామన్న చెరువు దగ్గర ఒకటి, మంచి నీటి కోసం గంగ తిప్ప దగ్గర మరొకటి పంప్ హౌస్‌లు వుండేవి. రైలు ప్రమాదాలు జరిగినప్పుడు వాడేందుకు 35 టన్నుల స్టీమ్ క్రేన్, మెడికల్, మెకానికల్, ఎలక్ట్రికల్, ఇంజనీరింగ్, బ్రిడ్జి రిపేరింగ్ పరికరాలు, యంత్రాలు, నిపుణులు, కార్మికులు ఎప్పుడూ సిద్ధంగా వుండేవారు. వారి కోసం బ్రేక్ డౌన్ స్పెషల్ రైలుండేది.

కార్మికుల సౌకర్యాలూ అపారం. వెయ్యి మందికి గృహ వసతి, తెలుగు, ఇంగ్లీషు మీడియంలలో ప్రైమరీ, సెకండరీ, ఉన్నత పాఠశాలలు; రిక్రియేషన్ క్లబ్, రైల్వే హెల్త్ యూనిట్ వగైరాలన్నీ నెలకొల్పారు. ఇవన్నీ గాక రైల్వేలకు 300 ఎకరాల భూమి వుంది. వివిధ ఆఫీసులు, పరిశ్రమలు, వర్క్‌షాపులు, ఇతర అవసరాల కోసం కట్టిన భవనాల సంఖ్య చెప్పతరం కాదు. వాటి విలువ కొన్ని కోట్లలో వుంటుంది. ఈ రోజు ధరల్లో ఈ లోకో షెడ్‌ను, ఇక్కడ ఏర్పడి వున్న ఇతర ప్రాథమిక వసతులను నిర్మించాలంటే ఎంత తక్కువలో చేసినా వంద కోట్లు దాటుతుందన్నది నిజం.

బిట్రగుంట
(4 పేజీ కొరవ)

ఇంతటి విలువైన లోకో షెడ్‌ను రైల్వే శాఖ పాడు పెట్టేసింది. పూర్తిగా వదిలేంది. సమూలంగా నాశనం చేస్తున్నది. 1981 లో స్టీమ్ ఇంజన్ల లోకం అంతరించి డీజలు, ఆ తర్వాత విద్యుత్ ఇంజన్లు వచ్చిన తర్వాత లోకో షెడ్ ప్రాముఖ్యత తగ్గింది. అయితే అధికారులు సమయస్ఫూర్తితో వ్యవహరించి, స్టీమ్ ఇంజన్ల కోసం పెట్టిన షెడ్‌ను కొద్ది మార్పులతో విద్యుత్ ఇంజన్ల మరమ్మత్తుకు మార్చి వుంటే బిట్రగుంట ప్రాధాన్యత ఎప్పటికీ తగ్గేది కాదు. కాని అది జరగ లేదు. అధికారులు ఈ విస్తారమైన రైల్వే సంపద పై నిరాసక్తత ప్రదర్శించారు. షెడ్‌లో పనిచేసే 1500 మంది కార్మికులను వివిధ ప్రాంతాలకు బదలీ చేశారు. బదలీలకు ఇష్టపడని ఐదారు శాతం మంది కార్మికులను ఇక్కడే వుంచి వూరకే జీతాలిస్తున్నారు. వారిని ఖాళీగా పెట్టలేక వ్యాగన్ల మరమ్మత్తు తల పెట్టారు కాని, అదీ సరిగా జరగడం లేదు.

భారీ క్రేన్స్, బొగ్గు బంకర్లను, మార్షలింగ్ యార్డ్‌లోని కోట్లు విలువ చేసే రైలు పట్టాలు, స్లీపర్లను పాత ఇనుప సామాను క్రింద చవకగా అమ్మేశారు. పెక్కు యంత్రాలు తుప్పు పట్టి పనికి రాకుండా పోయాయి. భవనాలు శిథిలమై పోయాయి. రైల్వే స్కూళ్ళన్నింటినీ ఇక్కడ నుంచి తరలించేశారు. ఆర్‌పిఎఫ్ అధికార్లు, కానిస్టేబిళ్లను బదలీ చేశారు. ఇంత చేసినా ఇంకా ట్రాక్షన్ రోలింగ్ స్టాక్ డిపోలో 450 మంది, మెకానికల్ యూనిట్‌లో 259 మంది, ఇంజనీరింగ్‌లో 379 మంది, ఆర్‌పిఎఫ్ సెక్యూరిటీ వింగ్‌లో 25 మంది, మెడికల్ యూనిట్‌లో 79 మంది, కమర్షియల్ విభాగంలో 41 మంది, ట్రాఫిక్ వింగ్‌లో 245 మంది,

8 పేజీలో

**Before the Principal Motor Accidents Cliams Tribunal, Nellore**

M.V.O.P. No. 698 / 92

Between:

Farida Begam. Being minor N.F. mother Adila begam - Claimant
J.P. Panneer Selvam and another
- Respondents

To. R1. J.P. Panneer Selvam
S/o. Jagannadham.
Lorry Onwer. James Garden. NELLORE

### 1వ రెస్పాండెంటుకు నోటీసు

పై నంబరు గల కేసులో పై క్లెయిమెంటు నీ మీద నష్ట పరిహారం కోరుచూ పై కోర్టులో నీ మీద పిటీషను దాఖలు చేసి యున్నది దాని మీద నోటీసు నిమిత్తం 14.9.93 తేదికి వాయిదా వేసి యున్నారు. కావున వాయిదా రోజా పగలు ఉదయం 10.30 గంటలకు నీవు స్వయముగా గాని నీ తరఫున వకీలు గారి ద్వారా గాని హాజరై నీ అక్షేపణలు తెలుపు కొన వలెను. లేని యెడల నీ పరోక్షమందు తీర్మానించ బడునని ఇందు మూలమున నీకు తెలియ జేయడమైనది.

నెల్లూరు **అరిగెల నాగేంద్ర సాయి**
క్లయిమెంటు తరుపు అడ్వకేటు

**Before the Principal Motor Accidents Cliams Tribunal, Nellore**

M.V. O.P. 696 / 92

Between:

Gulshad Begam
- Claimant

Vs

J.P. Panneer Selvam and another
- Respondents

To. R1. J.P. Panneer Selvam.
S/o. Jagannadham.
Lorry owner. James Garden. NELLORE.

### 1వ రెస్పాండెంటుకు నోటీసు

పై నంబరు గల కేసులో పై క్లెయిమెంటు నీ మీద నష్ట పరిహారం కోరుచు పై కోర్టులో నీ మీద పిటీషను దాఖలు చేసి యున్నారు. దాని మీద నోటీసు నిమిత్తం 14.9.93 తేదికి వాయిదా వేసి యున్నారు. కావున వాయిదా రోజా పగలు ఉదయం 10 గంటలకు నీవు స్వయముగా కాని నీ తరఫున వకీలు గారి ద్వారా కాని పై కోర్టులో హాజరై నీ అక్షేపణలు తెలుపుకొన వలెను లేని యెడల నీ పరోక్షమందు తీర్మానించ బడునని ఇందు మూలమున నీకు తెలియజేయడమైనది.

నెల్లూరు **అరిగెల నాగేంద్రసాయి**
క్లయిమెంటు తరఫున అడ్వకేటు

# శివారెడ్డి పద్యాలు

## పుణ్యమేదో జేసి పుట్టా

పుణ్యమేదో జేసి పుట్టాలి లేకున్న
లక్షలాది ధనము లభ్యపడదు
చదువు పాము వున్న సౌశీల్యవతి నీకు
గృహిణి గాదు, వున్న గొప్పమె యిది!

ఆదినాల్లో స్త్రీ ఆరాధ్యదైవమ్ము
కట్టుకున్న భర్త కాలం మార్పు
యిప్పుడెట్ల వుందో అప్పచ్చి రామన్న
నాటు పురము కవికి నాకు దెలుసు

## మిద్దెలు మేడలు

మిద్దెలు మేడలు ప్రతిదీ
పద్దినాలె, కాలువారి పర్మా వంటె
పెద్దాసుపత్రి వందల
కొద్దిఖర్చు మాకు లెక్క కోటీశ్వరులూ!

## కుస్తీపట్లు

కుస్తీపట్లు తెయిలి గొట్టాట్లు పొట్లాట్లు
తిన్న దరగడంల వున్నవార్లా!
నాటుపురము కవికి నాకెం వొచ్చింది
కలము పూరు కోదు కలిబెడతది!

## మంచి కోడి

జాము జామున నీ కీర్తి జాలు కోడి
వెంట దిబ్బల దిరుగాదు పేర కోడి
మాయమర్మమ్ము లెరుగని మంచి కోడి
గొంతుగోయకునువుపచ్చిగూండ గాకు!

## మనసు మార్చుకున్న

కవిని నేను పైకి పోవాలి నమకున్న
నిన్న మొన్నటొకు నేదు తిరిగి
మనసు మార్చుకున్న మరణించెదిష్టంల
వుంఠ దలచనూరుధిల్లా నిండె వరకు!

## నెల్లూరు సంగతులు

(4 పేజికొరవ )

ఏకైక రచయితని గోపాల్ రెడ్డి గారు ప్రశంసించారు. వక్త వెంకటేశ్వర విశ్వ విద్యాలయం సంస్కృత ప్రధానాచార్యులు శ్రీ ఎస్.బి. రఘునాథా చార్య అభిజ్ఞాన శాకుంతలం పై కడు రమ్యంగా వుపన్యసించారు. సామాజిక స్పృహ కాళిదాసు కవిత్వంలో వున్నట్లు మరే సాహిత్యంలోనూ గోచరించదు. ప్రకృతి వర్ణనలో 'ఉపమా కాళి దాసస్య' సూక్తిననుసరించి అసాదృశ్య ఉపమానములు వర్ణించడంలో అతని కాతడే సాటి అన్నారాయన. లేడి పరుగును వర్ణించినా, రథ చోదనము సాగించినా, భ్రమర వృత్తాంతం రచించినా కనులకు కట్టినట్లు ఆ రూపాన్ని సాక్షాత్కరింప జేస్తాడు. శకుంతల అత్త వారింటికి వెళ్లునప్పుడు 'అపసృత పాండు పత్రహ' ముంచంతి అశ్రూణీ వలతహ అంటూ పండు టాకుల నెపంతో లతలు కన్నీరు బొట బొట కార్చినట్లు, నెమళ్లు నాట్యం మానగా, లేళ్లు దర్భలు నములుతూ వేగున లేశాయని ప్రకృతినే యేడ్పించిన మహానుభావుడు కాళిదాసని రఘునాథాచార్య ప్రస్తుతించారు.

జ్ఞానపీఠ అవార్డు సభ్యునిగా కూడా శ్రీ రఘునాథాచార్య నియమితులు కావడాన్ని హర్షిస్తూ శ్రీ విద్యాపతి, శ్రీ బెజవాడ గోపాల రెడ్డి సమక్షాన ఆయనకు సన్మానం గావించారు. చివరన సదస్సు వ్యవస్థాపకుడు శ్రీ గోసుకొండ వెంకట సుబ్బయ్య వందనాలు చెప్పారు. మినహాయించి రెగ్యులర్ పండిత, ప్రకాండులతో సభ కళకళ లాడింది.

### జల యజ్ఞంతో వాన చినుకులు!

బంగాళాఖాతంలో అల్పపీడన పుణ్యమో, విప్రోత్తముల విఘ్నేశ్వరుని యజ్ఞఫలమో తెలియదు గాని మొల్లానికి 5 తేది ఉదయం టౌనులో నాలుగు చినుకులు రాలాయి. వాన కోసం యజ్ఞం చేయాలని పాండు రంగ అన్నదాన సమాజం ధర్మకర్తల మండలి తలపెట్టింది; 5 తేది ముహూర్తం నిర్ణయించింది; అదృష్టం బాగుండి ఆ రోజే మబ్బు పట్టింది. మబ్బు మసకేసిన ఆ సుమూర్తాన 250 మంది పైగా విప్రోత్తములు పవిత్ర పినాకి నదీ తీరాన స్నానమాచరించి, వరుణ ప్రార్థనలు చేసి, కలశాలతో తీర్థాలు తీసుకొని బయలు దేరారు. దారి మధ్యలోనే చినుకులు పడ్డాయి. వప్పుల వీధిలోని శ్రీసిద్ధి విఘ్నేశ్వరాలయం చేరి వేద మంత్రాల మధ్య స్వామి వారికి అభిషేకం చేసారు. అరవత్తూరు విశ్వనాథ శ్రౌతులు, మాచవోలు రాజశేఖరం గార్లు కార్యక్రమాన్ని పర్యవేక్షించారు. ఇంతకీ ఈ నాలుగు చినుకులు రాలడానికి జలయజ్ఞమే కారణమంటారా?

### నెల్లూరు ఖ్యాతిని నిలబెట్టాలి

నెల్లూరు సెంట్రల్ స్కూల్‌లో ఎంసెట్ లాంగ్ టర్మ్ కోచింగ్ తీసుకొనే విద్యార్థులు గతంలో కన్నా ఎక్కువ ర్యాంకులు తెచ్చుకొని శిక్షణ తీసుకొన్న సంస్థకు పేరు తీసుకోరాగల రన్న విశ్వాసాన్ని శ్రీ ఆనం వివేకానంద రెడ్డి వ్యక్త పరిచారు. 5వ తేది ఎన్.సి.ఎస్ కోచింగ్ ఇన్స్టిట్యూట్ లాంగ్‌టర్మ్ ఎంసెట్ క్లాసులు ప్రారంభించి మాట్లాడారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఎలక్ట్రిసిటీ సి.ఇ. గురుమూర్తి రెడ్డి దిన దిన ప్రవర్ధమాన మవుతున్న ఎన్.సి.ఎస్ మరింత పైకెదగాలని కోరుతూ, ఈ సంవత్సరం ఇంజనీరింగ్ ఎంట్రెన్స్‌లో 58 ర్యాంకు తెచ్చుకొన్న విద్యార్థినికి బంగారు పతకం అందజేసారు. వ్యక్తిగత శ్రద్ధ, చక్కని సిబ్బందే ఎన్.సి.యస్. విజయ బాటకు సారథులని శాస్త్రవేత్త వై. హర్షవర్ధన రావు ప్రస్తుతించారు. డాక్టర్ ఎస్. శ్రీనివాసులు రెడ్డి, డాక్టర్ పెళ్లకూరు రవీంద్ర రెడ్డి సంస్థ వున్నత స్థానమలంకరించాలని అభిలషించారు. కుటుంబ వాతావరణంలో జరిగిన ఈ కార్యక్రమానికి సంస్థ డైరెక్టర్ కె.ఎస్. రావు స్వాగతం చెప్పారు. శ్రీహరి కోటకు చెందిన ఎ.శేషారత్నం లలిత సంగీతం వీనుల విందుగా సాగి శ్రోతలను ఆకట్టుకొంది.

### అక్కినేని జన్మదినోత్సవం పోటీలు

ఎప్పటిలానే అక్కినేని కల్చరల్ అసోసియేషన్ తమ అభిమాన నటుని 70వ జన్మదినోత్సవాన్ని ఘనంగా నిర్వహించ తలపెట్టింది. అందులో భాగంగా ఈనెల 21వ తేది ఇందిరాభవన్‌లో జాతీయ స్థాయిలో సంగీత పోటీలను పెడుతున్నారు. సినిమా పాటలు, జానపద సంగీతం, లలిత సంగీతం, జానపద నృత్యాలు, రికార్డ్ డాన్స్, బ్రేక్ డ్యాన్సులు పోటీల్లోని అంశాలు. పూర్తి వివరాలకు ఎం.డి. బాజాని, కార్యదర్శి, అక్కినేని కల్చరల్ అసోసియేషన్, 15/414 ట్రంకురోడ్డు, నెల్లూరు చిరునామాకు రాసి తెలుసుకోవచ్చు.

## జిల్లావార్తలు

( 7 పేజికొరవ )

అధికారిక కార్యక్రమాలూ మంద కొడిగా సాగుతున్నాయి. మండలం సంగతి అటుంచితే, గ్రామ పంచాయితీ వ్యవహారాలు చూసేందుకు కార్యనిర్వహణాధికారి గాని, శానిటరీ ఇన్స్‌పెక్టర్ గాని లేరు. ఎన్నికలే పెట్టక పోవడం వల్ల ప్రజా ప్రతినిధులు లేరు ఏ చిన్న పనికైనా స్పెషల్ ఆఫీసరైన ఎమ్మార్వోను కలవాల్సి వస్తుంది. రెవిన్యూ వ్యవహారాలే కొకొల్లలు. పంచాయితీ విషయాలు ఆయనకు తలనొప్పి కల్గించి నట్లుంది; పంచాయితీ గూర్చి పట్టించు కోవడం మానేశారు. శానిటరీ అధికారి లేక పోవడం వల్ల గ్రామ పరిశుభ్రత సమస్యగా పరిణమించింది. వున్నతాధికార్లు ఈ సమస్య పరిశీలించి ఇన్‌ఛార్జీల పసలేని పాలనలో విసిగి వున్న ప్రజలకు సిసలైన అధికారులను నియమించాలి.

## బిట్రగుంట

( 7 పేజికొరవ )

సిగ్నల్ అండ్ టెలి కమ్యూనికేషన్స్ విభాగంలో 77 మంది, ఎలక్ట్రికల్ మెయింటెనెన్స్ డిపోలో 36 మంది, స్కూళ్లలో 20 మంది పనిచేస్తున్నారు. ఈ ఏడాది జూలైలో లోకో షెడ్‌ను నిరవధికంగా, సంపూర్ణంగా మూసి వేస్తున్నట్లు రైల్వే శాఖ ప్రకటించింది. దీనితో లోకో షెడ్ అంతరించి పోయినట్లే లెక్క. 112 సంవత్సరాల సుదీర్ఘ చరిత్రలో ఎంతో అద్భుతమైన సేవలందించిన పారిశ్రామిక కేంద్రం నిర్వీర్యమై పోయింది.

అన్ని సౌకర్యాలూ వున్న ఇక్కడ ఒక వ్యాగన్ వర్క్ షాప్ పెట్టమని కార్మికులు ఆందోళన చేశారు. కాని, కోట్లాది రూపాయలు వెచ్చించి విజయవాడ దగ్గర రాయన పాడులో కొత్తగా కట్టారు తప్ప, ఇక్కడ నెలకొల్ప డానికి అధికారులు సమ్మతించ లేదు. కనీసం క్యారేజ్ రిపేరు వర్క్ షాప్ పెట్టమని కార్మిక సంఘాలు అడిగాయి. కానీ ఆ విన్నపాన్నీ పెడ చెవిన బెట్టి, రేణిగుంట దగ్గర కొత్త షాప్ కట్టారు. ఈ రెండింటిలో ఏది బిట్రగుంటలో పెట్టి వుండినా రైల్వేలకు కొన్ని కోట్ల రూపాయల ఖర్చు మిగిలి వుండేది.

కళ్ల ముందున్న కట్టడాలను, యంత్రాలను శిథిలం చేసి కొత్త వాటి కోసం ఖజానాను దోచి పెట్టడంలోని అంతర్యం ఏమిటి? రైల్వేలకు బిట్రగుంట అంటే ఎందుకింత కక్ష? కొందరు అధికారులు బిట్రగుంటలో రైల్వే ఆస్తులకు భద్రత లేదని, అది కమ్యూనిస్టుల ప్రాబల్యం కల్గిన ప్రదేశం కాబట్టి కార్మిక అశాంతి ఎక్కువని చెప్తారు. ఇవి రెండూ కుంటి సాకులే. రక్షక దళం అధికారులు లంచాల గడ్డి మేయడం వల్ల రైల్వే ఆస్తులు చోర గ్రస్తమౌతున్నాయి తప్ప, వారు కఠినంగా వ్యవహరిస్తే పూచిక పుల్ల కదులుతుందా? కమ్యూనిస్టుల ప్రాబల్యం అనేది వట్టి అబద్ధం. గత ఇరవయ్యేళ్లలో బిట్రగుంటలో కమ్యూనిస్టులు ఎన్ని ఎన్నికలు గెల్చారు? ఎన్ని ఓట్లు వచ్చాయి? అందువల్ల ఇవి రెండూ కుంటి సాకులే. అసలు కారణం - ఇక్కడ అధికారులకు సరైన రిక్రియేషన్ సౌకర్యాలు లేక పోవడమే. తమ పిల్లలకు చదువులు, తమకు కాలక్షేపం లేని చోట వచ్చి పని చేయడానికి అధికారులు ఇష్టపడ నందువల్లే వారు బిట్రగుంటను బీడు పెడుతున్నా రన్నది వాస్తవం. రైల్వేలలోని ఒక ఉన్నతాధికారికి, ఇక్కడి కార్మిక సంఘాలకు మధ్య ఏర్పడిన వ్యక్తిగత వివాదంతో, ఆయన కక్ష కట్టి ఇంత అనర్థం సృష్టించారన్న ఆరోపణ కూడా వుంది.

విచారించాల్సిన విషయమే మిటంటే, అధికారులు కక్ష కట్టినట్లు బిట్రగుంటను సర్వనాశనం చేస్తుంటే ఒక్క జిల్లా నాయకుడు, ఎమ్పీ, ఎమ్మెల్యే కూడా సరైన తీరులో ప్రతిస్పందించక పోవడం. ఎవరూ ఈ అన్యాయాన్ని కేంద్ర ప్రభుత్వం దృష్టికి తీసుక వెళ్లి పోరాటం సల్పడం లేదు; ఉద్యమం నడపడం లేదు; వత్తిడి తేవడం లేదు. కనీసం రైల్వేలకు చెందిన అనుబంధ పరిశ్రమల ఏర్పాటుకూ ప్రయత్నించడం లేదు. మన నాయకులు చేవ చచ్చిన వారని, చేత కాని వారని ఎన్ని సందర్భాలలోనో రుజువౌతున్నది. ఇప్పుడూ అంతే!

- షేక్ మహమ్మద్ హనీఫ్

## పంచాంగము

### ఉత్తరకార్తె

13 తేది సోమవారము ఉత్తర కార్తె ప్రారంభము.

### శూన్యమాసము

17 తేది శుక్రవారము కన్యా భాద్రపదము శూన్యమాసము

### సెప్టెంబర్ తిథులు

అధిక భాద్రపద బహుళ

| | |
|---|---|
| తే 11 శని దశమి సా.గ. | 6 10 వ |
| తే 12 ఆది ఏకాదశి సా.గ. | 5.02 వ |
| తే 13 సోమ ద్వాదశి సా.గ. | 3.40 వ |
| తే 14 మంగళ త్రయోదశి ప.గ. | 1.45 వ |
| తే 15 బుధ చతుర్దశి ప.గ. | 11.45 వ |
| తే 16 గురు అమావాస్య ప.గ. | 9.25 వ |

నిజ భాద్రపద శుద్ధ

| | |
|---|---|
| తే 17 శుక్ర పాడ్యమి ఉ.గ. | 7.05 వ |
| తరువాత విదియ రా.గ. | 4.50 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

# బాలకృష్ణ సినిమా రిలీజు బొమ్మలాటగా మారింది!

ఏ మాత్రం వైవిధ్యం లేకుండా హడావిడిగా రీళ్లు చుట్టేసిన చిత్రాలు పుంఖాను పుంఖాలుగా విడుదలవడం కొద్దీ ప్రేక్షకులకు తెలుగు చిత్రాల పట్ల మోజు తగ్గి చిత్రపరిశ్రమ ఆందోళనలో ఉన్నసమయంలో ఒకే హీరోవి రెండు చిత్రాలు ఒకే రోజు విడుదలవడ మేమిటి? ఇది వరకెన్నడూ ఇంత విపరీతం జరగలేదు. ఇటుపైన జరగబోదు కూడా. అయిన, ఇది ఎంత సాహసం? ఇందులో తప్పెవరిది? నష్టపోయేది ఎవరు? చివరికి ఫలితమేమిటో తమాషా చూడడానికి మిగతా చిత్ర పరిశ్రమ ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తోంది.

బాలకృష్ణ నటించిన విజయశాంతి చిత్రం ''నిప్పురవ్వ'' చాలా కాలంగా నిర్మాణంలో ఉంది. అలస్యం వల్ల నిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. ఎలాగో సెప్టెంబర్ 3న విడుదల చేస్తున్నట్లు ఆ నిర్మాత ముందు నుంచి చెపుతూ ఉన్నారు.

ఆ తర్వాత విడుదలవ వలసిన చిత్రం జగపతివారి ''బంగారు బుల్లోడు''. బాలకృష్ణకూ, 'నిప్పురవ్వ' చిత్ర నిర్మాత శ్రీనివాస్ ప్రసాద్‌కూ మొదట్నుంచీ ఏవో మనస్పర్థలు ఉన్నాయి. (ఇద్దరికి చుట్టరికం కూడా ఉంది!). ఈ చిత్రం కన్నా 'బంగారు బుల్లోడు' చిత్రంలో కథ, టేకింగ్, తన గెటప్, నటనకు స్కోప్ ఎన్నోరెట్లు ఎక్కువగా ఉన్నాయని బాలకృష్ణ అభిప్రాయం. అందుకే ఈయన ప్రోద్బలంతోనే ఈ చిత్రం కూడా సెప్టెంబర్ 3నే విడుదలయింది.

ఇలా హీరో దామినేషన్ వల్ల ఎన్ని అనర్థాలు? ఈ భారీ బడ్జెట్ చిత్రాలకు విపరీతంగా డబ్బు పోసి కొన్న బయ్యర్స్ గతి ఏమవ్వాలి? పంతాలకు, పట్టింపులకు ప్రేక్షకులు గురి కావాలంటే జరిగే పనేనా? ఈ ఉభయ చిత్ర నిర్మాతలతో పాటు బాలకృష్ణ అభిమాన సంఘాల వారు కూడా విస్మయులై పోయారు. పైగా వినాయక చవితి సందర్భంలో 'బంగారు బుల్లోడు' కూడా తన అంగీకారంతోనే విడుదలవుతున్నట్లు బాలకృష్ణ ప్రత్యేకంగా పత్రికా ప్రకటన ఇచ్చుకున్నాడు కూడాను. అఖరికి ఇదొక బొమ్మలాటలా అయిపోయింది.

'నిప్పురవ్వ' చిత్రం బాగా ఆడుతోందని కొన్ని కేంద్రాల నుంచి, 'బంగారు బుల్లోడు' బాగా ఆడుతోందని మరికొన్ని ప్రాంతాల నుంచి వార్తలు వస్తున్నాయి. మరొరెండు మూడు వారాలకు గాని ఇదమిద్ధంగా తెలదు.



దొంగల్లుడు చిత్రంలో సుమన్, సౌందర్య

## కమర్షియల్ జిమ్మిక్కుల మసాలా చిత్రం

# బంగారు బుల్లోడు

చిత్రసమీక్ష

అల్లూరు రహీం

సకుటుంబ, సపరివార సమేతంగా చూడతగ్గ చిత్రాలను ఒకప్పుడు తీసిన జగపతి ఆర్ట్స్ అధినేత వి.బి. రాజేంద్ర ప్రసాద్ కాలానుగుణంగా తన ధోరణి మార్చుకొన్నారన్న విషయం బాలకృష్ణ - రవిరాజ పినిశెట్టి కాంబినేషన్‌లో తీసిన ''బంగారు బుల్లోడు' చూస్తే ఇట్టే అర్థమై పోతుంది. పటుత్వం లేని కథను నడపను హీరోయిన్ల అంద చందాలను ఆర బోసాడు. వారినోటి నుంచే ''దమ్ము పగలి పోద్ది, గుద్దుకో, వూపేసుకో, రుద్దుడికి తట్టుకోలేవా.'' వంటి వినలేని ద్వంద్వార్థపు సంభాషణలు చెప్పించాడు. వురిశిక్ష విధించ బోతున్న సమయంలో విలన్ సెంట్రల్ జైలు నుండి తప్పించుకొని హెలికాప్టర్‌లో రావడం, మరో ఇన్స్‌పెక్టర్ గూండా గ్యాంగులతో తరలి వచ్చి స్వంత డిపార్ట్‌మెంట్ వారిని వూచకోత కోసేసినా, ఆ విషయం హెడ్ క్వార్టరు తెలిసే అవకాశం వున్నా శుభం పడే ముందు కూడా ఒక్క పోలీస్ రాకపోవడం దర్శక ప్రతిభే. లాల్ బహదూర్ స్టేడియంలో హత్యకు గురైన డి.ఐ.జి. వ్యాస్ సంఘటనను సమయస్ఫూర్తిగా వాడుకొన్న దర్శకుడు హీరోయిజం ప్రదర్శన కోసం పోలీసులను వాడుకొన్నట్లు లేదు. ఒక బాల నటుడి చేత హీరోయిన్ వర్ణనలు చేయించడం క్షమించ రాని తప్పు. మాస్‌ను ఆకట్టుకునే పాటలు, హీరోయిన్ల వంటి విరుపులు 'హ్యాండ్ సమ్ బాయ్' బాలకృష్ణ వెండి తెరపై సుదీర్ఘ విరామం తరువాత కన్పించడంతో ఆయన అభిమానులు ఆనందంతో ఎగబడే ఫక్తు మాస్ మసాలా, కమర్షియల్ జిమ్మిక్కుల చిత్రమే బంగారు బుల్లోడు.

రాణి (రమ్యకృష్ణ) కి బావ బాలయ్య (బాలకృష్ణ) అంటే పంచ ప్రాణాలు. అందుకే ఎవరైనా తన బావకు సంబంధాలు తీసుకొని వస్తే వాళ్లను పెద్దా, చిన్నా చూడక చితక బాదుతూ, బావను ఆకట్టుకొను వలపులహోయలు ఒలక బోస్తుంది. మామ రామదాసు (రావు గోపాల రావు) అక్రమాలను ఎదుర్కొంటూ యాంగ్రీ యంగ్ మెన్‌లా హ్యాపీగా జీవితం సాగిస్తున్న బాలయ్య జీవితంలోకి తాను కూడా మరదలినేనని ప్రియ (రవీనా టాండన్) వస్తుంది. పట్టణ అందాలు ప్రదర్శిస్తూ, బాలయ్య బర్త్‌డే కూడా ఘనంగా జరిపించిన ప్రియ వైపు ఆకర్షితు డవుతాడు బాలయ్య. ఈ విషయం గమనించిన రాణి అసహనంతో రెచ్చి పోతుంది.

కాని వంటి విరుపులకు బాలయ్య లొంగడని, ఎప్పటికైనా తనవాడేనని; ప్రియ సొంతం చేసుకోలేదని ఛాలెంజ్ చేస్తుంది రాణి.భామలిద్దరి పంతాలు తెలియని బాలయ్య ప్రియ వైపు తొలుత మొగ్గి, పాము కాటుకు గురై మంచమెక్కినప్పుడు ప్రియ వంచన విషయం తెలుసుకొని వుగ్రుడై పోతాడు. దెబ్బకు దెబ్బ తీయాలని భావించిన బాలయ్య ప్రియ మెడలో బలవంతంగా తాళి కట్టి ఆమె శిక్ష అనుభవించాలని శాసిస్తాడు.

ఫ్లాష్ బ్యాక్‌లో ప్రియ డి.ఐ.జి. బెనర్జీ చెల్లెలు. పేరొందిన వుగ్రవాది నానా (కన్నడ నటుడు దేవరాజ్) తన తమ్ముడ్ని చంపడమే గాక తనను అరెస్ట్ చేసినందుకు పగబట్టి, డి.ఐ.జి.ని కుటుంబాన్ని చంపుతానని ప్రతిన బట్టి తన అనుచరుల చేత డి.ఐ.జి. అతని భార్యను, బిడ్డను చంపిస్తాడు నానా. విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయిన కుటుంబంలో ఏకైక సభ్యురాలైన ప్రియను వ్యయ ప్రయాసలు పడైనా కాపాడాలని పోలీస్ శాఖ నిర్ణయం తీసుకుంటుంది. అందులో భాగంగా అధికారిణి తులసి (శ్రీవిద్య) సలహా మేరకు ఆమెను నానా రాలేని అతని స్వగ్రామమైన పూడిపల్లిలో బాలయ్య మరిదిగా రంగప్రవేశం చేయిస్తుంది. నాటకీయంగా పెళ్లి జరిగినా నిదానంగా ప్రియ, బాలయ్య దగ్గర అయ్యే సమయంలో బ్లాక్ మెయిలింగ్ నేరంలో శిక్ష అనుభవిస్తున్న రామదాస్ వురిశిక్షకు సిద్ధంగా వున్న నానాకు తమ వూర్లో వున్న ప్రియ సంగతి చెప్పగా; అతను జైలు నుండి తప్పించు కొంటాడు. భార్యను రక్షించే వాడే భర్తన్న నినాదంతో నానాను మట్టి కరిపించి ఇద్దరి మరదళ్ళ మురిపాలు బాలయ్య పొందడంతో కథ సుఖాంతమవుతుంది.

ధర్మకుమార్ రాసిన వసలేని కథను ఒక రకంగా సత్యమూర్తి స్క్రీన్‌ప్లే, మాటలు ప్రాణం పోసినా, మోతాదు

కొరవ 10 పేజీలో

# వివేకానందుడ్ని తెర కెక్కిస్తున్న తిక్కవరపు!

సంస్కృతం, తెలుగు, తమిళ, హిందీ భాషల్లో తయారై 1992 సంవత్సరానికి కేంద్ర ప్రభుత్వం నుండి 'స్వర్ణకమలం' అందుకున్న 'భగవద్గీత' చిత్రం సెప్టెంబర్ 17న హైదరాబాద్, విజయవాడ, శ్రీకాకుళం, విశాఖ కేంద్రాలతో పాటు తమిళనాడులో నాలుగు కేంద్రాలలో విడుదల కానున్నది. సంగీతం:బాల మురళీకృష్ణ దర్శకత్వం జి.వి. అయ్యర్. సెప్టెంబర్ 17వ తారీఖునే 'ఫర్' హిందీ చిత్రం ఆధారంగా డాక్టర్ రాజశేఖర్ ద్విపాత్రాభినయం నిర్వహించే చిత్రానికి ప్రారంభోత్సవం జరుగుతుంది.

## భగవద్గీత ఉత్సాహంతో సుబ్బరామ రెడ్డి కొత్త యత్నం!

తిక్కవరపు సుబ్బరామి రెడ్డి ధన్యుడు. తిరుమల తిరుపతి దేవస్థానం చైర్మన్‌గా ఆటుస్వామికి, ఇటు భక్తులకు ఎనలేని సేవలు చేశాడు. మహా మనిషి స్వామి వివేకానంద జీవిత చరిత్రను బెంగాలీ, తెలుగు, తమిళం, హిందీ ఆంగ్లభాషల్లో అక్టోబర్ 15 నుండి నిర్మించనున్నారు. ఇందులో వివేకానందగా సర్వదమన్ బెనర్జీ, రామకృష్ణ పరమహంసగా నసీరుద్దీన్‌షా, ఇంకా తనూజ, అమ్రేష్ పురి, గౌరవ నటవర్గంలో శ్రీదేవి, హేమమాలిని, జయప్రద, మాధురీ దీక్షిత్, డింపుల్ కపాడియా పాల్గొంటారు. గత సంవత్సరం దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు అందుకున్న భూపేన్ హజారికా ఈ చిత్రానికి సంగీత దర్శకుడు, మధు అంబట్ ఛాయాగ్రాహకుడు, జి.వి. అయ్యర్ దర్శకుడు.

## హీరో రఘు వివాహం

''రేపటి రౌడి'' వగైరా చిత్రాలలో నటించిన రఘు అసలు పేరు రెహమాన్. అతను సెప్టెంబర్ 12న పారిశ్రామిక వేత్త అబ్దుల్ సిదారిన్ కుమార్తె మెహరున్నీసాను వివాహమాడ బోతున్నాడు.

## రామ్ గోపాల వర్మ దర్శకత్వంలో మణిరత్నం

డైరక్టర్ మణిరత్నం, రామ్‌గోపాల్ వర్మ ఆప్త మిత్రులు. టేకింగ్‌లో ఇద్దరి టెక్నిక్ అత్యాధునికంగా ఉంటాయన్న విషయం అందరూ ఎరిగినదే. వీళ్ళిద్దరూ ప్రారంభించిన ఆలయం ఫిలిమ్స్ పతాకంలో హీరో విజయకాంత్ ''క్షత్రియన్,'' హీరో శరత్‌కుమార్ ''దశరథన్'' చిత్రాలు తమిళంలో తయారయ్యాయి. ఇప్పుడు ''తిరుడా!తిరుడా!'' చిత్రం నిర్మితమవుతోంది. త్వరలోనే రామ్ గోపాల వర్మ దర్శకత్వంలో ఒక తమిళ చిత్ర నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

### జయభారత రెడ్డి మోహినీ అవతారం ధరించారు!

# గిట్టుబాటు శాఖలన్నీ తమ వారికే ఇచ్చుకుని వట్టి ఆకులు తమకు మిగిల్చారని బిసిల గోడు!

పెంచడంతో పాటు, వారికి మరింత ప్రాధాన్యత కల్గిన శాఖలు కేటాయించడం జరిగింది. తొలి నుంచి కోట్ల నిర్వహించేది జనార్ధన రెడ్డి క్యాబినెట్ అన్న ప్రచారం వుంది. దాన్ని పోగొట్టుకొని, తన స్వంత మార్కు మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తానని విజయభాస్కర రెడ్డి పలు మార్లు బహిరంగ ప్రకటనలు చేశారు కూడా! కాని ఈ విస్తరణలో ఆ లక్ష్యం నెరవేర లేదు. క్యాబినెట్‌లో కోట్ల అనుయాయులంటూ చెప్ప దగిన వారు ఒకరిద్దరు తప్పలేదు. మర్రి, పి.వి., వై.ఎస్. జనార్ధన రెడ్డి సంయుక్త క్యాబినెట్‌గా మాత్రమే అది రూపాంతరం చెందింది.

మునిసిపల్ మంత్రి శ్రీ నరసింహా రెడ్డి, కేంద్ర మంత్రులతో చెప్పించడంతో పాటు స్వయంగా ముఖ్యమంత్రిని కలిసి బెదరించి వచ్చినట్లు వినికిడి. "రాజశేఖర రెడ్డి, మీ మంత్రి వర్గంలో అవినీతి పరులున్నారని నిందించిన తర్వాత మీరు మమ్మల్ని తీసి వేస్తె ఆ నింద మా పైన పడుతుంది. ఆ పరిస్థితే వస్తె ఎవరెవరు ఎంతెంత అవినీతి పరులో మేము బయట పెట్ట వలసి వస్తుంది" అని హెచ్చరించాడట. ఎంత వరకు నిజమో తెలియదు కాని, జనార్ధన రెడి గారు కూడా ముఖ్యమంత్రికి ఫోన్ చేసి నా మనుషులను ఏరి, దెబ్బ తీయడానికి ప్రయత్నిస్తె పునాదులు కదిలే పరిణామాలు ఎదుర్కో వలసి వస్తుందన్న తీరులో మాట్లాడాడట. ఇవన్నీ ముఖ్యమంత్రిని పునరాలోచనలో పడవేశాయి. 7 తేది రాత్రి గవర్నరుకు వెళ్లిన జాబితాను మార్చి, కొన్ని సర్దుబాట్లు చేయవలసి వచ్చింది.

ఇంకొక ప్రక్క సంఖ్య పెంచడం తప్ప సమర్థత పెరగలేదన్న విమర్శనూ ముఖ్యమంత్రి ఎదుర్కొంటున్నారు. ఎన్నికల సంవత్సరం దగ్గర పడింది కాబట్టి, ఇప్పుడు మంత్రి వర్గంలో చేర్చుకునే వారు ఆయా జిల్లాలలో పార్టీని సమాయత్తం చేయగల్గిన వారై వుండాలి; అందర్నీ కలుపుకోగల్గి నాయకత్వం వహించ గల సమర్థులై వుండాలి. ఆ దృష్టితో చూసినప్పుడు కోట్ల సర్కస్ ఫెయిల్ అయినట్లే లెక్క. ఆయన కొత్తగా మంత్రులుగా తీసుకున్న వారు ఎవరూ అందుకు సమర్థులు కారు. పైగా తమ జిల్లాలో పెద్దరికం, మాట చలామణీ కల్గిన అదిలాబాద్ నాయకుడు సి. రామచంద్రా రెడ్డిని తొలగించారు. చంద్రబాబు నాయుడు, ముద్దు కృష్ణమ నాయుడు వంటి తెలుగుదేశం ప్రముఖులున్న చిత్తూరు జిల్లాను వదిలి వేశారు. అక్కడ శ్రీమతి గల్లా అరుణకు మంత్రిత్వం ఇవ్వాలని సిఎం సంకల్పించారు. కాని నల్లారి కిరణ్ కుమార్ పేరును పిఎం కార్యాలయం సిఫార్సు చేసింది. మర్రి చెన్నారెడ్డి గారు చెంగారెడ్డికి చీటీ ఇచ్చి పంపారు.

సమర్థత (మొదట పేజీ కొరవ)

ఈ న్యూసెన్స్ అంతా ఎందుకని ఆ జిల్లాయే వదిలేశాడు ముఖ్యమంత్రి. దీనివల్ల చిత్తూరులో కాంగ్రెస్‌కు నాయకత్వం సమస్య ఎదురౌతున్నది. తెలుగుదేశం ప్రభంజనం వీస్తున్న కృష్ణ జిల్లా నుంచి ముఖ్యులను, అక్కడ ప్రాబల్యం కల్గిన కమ్మ వారిని వదిలేసి అప్రధానుడైన బేగను ఎంపిక చేయడంలోనే ముఖ్యమంత్రికి రాష్ట్ర రాజకీయ స్వరూపం పై సరైన అవగాహన కల్గలేదన్న వాస్తవం అర్థమౌతున్నది. ఉభయ గోదావరి జిల్లాలలో కాపులు, రాజులకు తగిన ప్రాతినిధ్యం, ప్రాధాన్యత కల్పించ లేక పోయారు. నిజామాబాద్‌లో షబ్బీర్ అలీ నియామకం పార్టీకి ఎందుకూ పనికి రాదు. కర్నూలులో కెఇకి మంత్రిత్వం నిరాకరించి, తనలో కరడా కట్టిన ముఠా తత్వం ఎప్పటికీ సడలదని నిరూపించుకున్నారు. కర్నూలు లోక్ సభా స్థానానికి తన కుమారుడ్ని నిలబెట్టాలన్న ప్రతిపాదన వున్నప్పటికీ కెఇని ప్రక్కన పెట్టడంటే, ముఖ్యమంత్రి చాలా సాహసం చేసినట్లె లెక్క.

శాఖల కేటాయింపు ముఖ్యమంత్రి ప్రతిష్టను మరీ దిగజార్చింది. ఛీఫ్ సెక్రటరీ శ్రీ జయభారత రెడ్డికి ఆ పుణ్యకార్యం అప్పచెప్పారట. ఎంత నమ్మకస్తుడైనప్పటికీ, ఒక అధికారి మంత్రుల శాఖల కేటాయింపు చేయడం విడ్డూరమైన విషయం. రాష్ట్రంలో ఇది వరకెప్పుడూ ఇటువంటి విపరీతం జరగలేదు. ముఖ్యమంత్రి నుంచి స్వేచ్ఛను పొందిన జయభారత రెడ్డి మోహినీ అవతారం ధరించారు. పేరుకు బిసిలు, ఎస్‌సిలకు మంత్రిత్వాలిచ్చి, వారికి పనిలేని శాఖలు కట్టబెట్టి, గిట్టుబాటు, అధికారం కల్గిన శాఖలన్నింటినీ అగ్రకులాల చేతిలో పెట్టారన్న విమర్శ సర్వత్రా విన్పిస్తున్నది. హనుమంత రావు వంటి బిసి నాయకులు ఈ విషయం బహిరంగంగానే మాట్లాడుతున్నారు. రెవిన్యూ, హోం, రోడ్లు భవనాలు, పంచాయితీ రాజ్, రవాణా, వైద్యం, పరిశ్రమలు, సివిల్ సప్లయిస్, విద్య, ఆర్థిక, వ్యవసాయం, మునిసిపాలిటీలు, నీటి పారుదల ఎక్సైజ్, సహకారం వంటి ప్రధాన శాఖలన్నీ రెడ్లు, కమ్మ, బ్రాహ్మణులు వంటి అగ్ర కులాల వారి చేతిలో పెట్టారు. ఒక్క ప్రధాన శాఖ కూడా బిసి లేదా ఎస్‌సి మంత్రికి ఇవ్వలేదు. వర్గాల పరంగానూ ఈ వ్యత్యాసం పాటించారు. మర్రి శశిధర్ రెడ్డికి పర్యావరణం అనే ప్రత్యేక శాఖ సృష్టించి ఇచ్చారు. దానిలో పని వుండదు, ఒక్క ఫైలు రాదు. కనీసం తగిన సిబ్బంది, అధికారులూ వుండరు. జిల్లా పర్యటనలకు వెళ్తె పలుకరించే వారుండరు.

7 తేది రాత్రి, ముఖ్యమంత్రి – దివాకర్ రెడ్డి, మైసూరా రెడ్డిలను పిలిపించి "జయభారత్ రెడ్డి పోర్టుఫోలియోలు ఫిక్సు చేస్తున్నారు, పోయి చూసిరాండి" - అని చెప్పాడట. వారిద్దరూ పరుగెత్తుకుని పోయే సరికే అంతా అయిపోయింది. రవీంద్ర రెడ్డికి వైద్యం వంటి బలమైన శాఖ ఇచ్చి నాకు రవాణా ఇవ్వడం అన్యాయం కాదా అని మైసూరా లబలబ లాడుతున్నాడు. దివాకర రెడ్డి మాత్రం చల్లగా రేవుల పోర్టు ఫోలియో బోనస్‌గా కొట్టేశాడు. జయభారత్ రెడ్డి డాక్టర్ వై.ఎస్. అభిమాని కావడం ఇక్కడ గమనించ దగిన విశేషమను కుంటే విశేషమే మరి!

ఆర్థిక మంత్రి శ్రీ కె. రోశయ్యకు 'విద్యుత్ కోత' విధించాడు జయభారత్ రెడ్డి. పేపర్లు దాన్ని "పవర్ కట్" గా అభివర్ణించాయి. ఆర్థిక శాఖలో అధికారం తప్ప "అర్థం" వుండదు; గిట్టుబాటు కల్పించేది పవర్ పోర్టు ఫోలియోనే; ఆ పవర్ కట్ చేస్తె ఎట్లా? రోశయ్య సిఎంను కలిసి శాఖల మార్పు మీ స్వయం నిర్ణయాధికారమే అయినా, సీనియర్ మంత్రుల శాఖలు మార్చేటప్పుడు చెప్పి మార్చడం మర్యాద కాదా అని మెత్తగా అడిగాడట. ముఖ్యమంత్రి ఏదో సర్ది చెప్పేశాడు. అందుకు నిరసనగా రాజీనామా చేస్తానని రోశయ్య అక్కడా ఇక్కడా అన్నాడు కాని, అవి ఉడత ఊపులన్న సంగతి అందరెరిగిందే.

మొత్తానికి శాఖల మార్పు బాధ్యత ఛీఫ్ సెక్రటరీకి అప్పచెప్పి ముఖ్యమంత్రి తన ప్రతిష్ట దిగ జార్చుకున్నారు. అది ఆయనకు సిగ్గు చేటైన విషయం.

# జనార్ధన రెడ్డికి 'చెక్' పెట్టడమే సిఎం భావమా?

ఒక గుర్తింపును, ప్రజాను రంజకతను పొందారు యానాదిరెడ్డి. 1978 ఎన్నికల్లో తొలిసారిగా ఇందిరా కాంగ్రెస్ టిక్కెట్ పై ఎమ్మెల్యేగా గెల్చాడు. యానాదిరెడ్డిలోని ఒక సుగుణం – పార్టీలు మార్చక పోవడం; అప్పుడు, ఇప్పుడు ఎప్పుడూ ఆయన కాంగ్రెస్ వాదే. పొరపాటున కూడా ప్రక్క దారులు తొక్కలేదు. 1983 తెలుగుదేశం ప్రభంజనంలో అందరి వలె తానూ ఓడిపోయారు. తిరిగి 1985లో తెలుగుదేశం అధికారంలో వుండి, పూటికొక్క మంత్రిని ఎలక్షన్ ఏజంట్లుగా దింపి, అధికార దర్పాన్నంతటినీ ప్రదర్శించినా ధైర్యంగా ఎదుర్కొని విజయం సాధించాడు. పాలకీర్తి కోటయ్య హత్యతో వాయిదా పడి ఆలస్యంగా జరిగిన ఎన్నిక అది. ఆ తర్వాత 1989 లో సునాయసంగా గెలుపొందాడు.

సమితి అధ్యక్షుడుగా వున్నప్పుడే నుంచి హైదరాబాదు రాజకీయాలతో సంబంధాలు వున్నాయి. జలగం వెంగళ రావు, మర్రి చెన్నారెడ్డి, కోట్ల వంటి వారిని కలిసి, ఒక దండం పారేసి వచ్చేవాడు. అధికార్ల దగ్గర పనులు చేయించు కోవడంలో యానాదిరెడ్డిని మించిన వారు లేరు. కావలి ఎమ్మార్వో ఆఫీసు నుంచి సెక్రటరియేట్‌లోని కార్యదర్శుల గదుల వరకు చొరవగా చొచ్చుక పోయి

యానాదిరెడ్డి (మొదటి పేజీ కొరవ)

ఫైళ్లను పరుగెత్తించ గల కిటుకులు ఆయన కెన్నో తెలుసు. ఎవ్వరితోనూ విరోధం పెట్టుకోడు – ఎవ్వరికీ వుపయోగ పడడు.

ఇరవై ఐదేళ్ల రాజకీయ జీవితంలో అవినీతి ఆరోపణ అన్నదే ఎరుగని అరుదైన రాజకీయ వాది యానాదిరెడ్డి. ఏ పనికీ, ఏ ఒక్కరూ ఆయనకు ఒక్క రూపాయి ఇచ్చినట్లు చెప్పలేదు. మ[illegible]సు, హైదరాబాదులలో తన కళా ప్రావీణ్యతా ప్రదర్శనలో తానేమి పాట్లు పడలాడో మనకైతే తెలియదు. కాని, అవినీతి బురద వంటి పై పడకుండా స్వచ్ఛంగావుండ గల్గాడింత కాలం. మంత్రిగా కూడా ఆ మంచి పేరు నిల్పుకో గల్గితే ధన్యుడౌతాడు.

జిల్లా రాజకీయాలలో యానాదిరెడ్డి ప్రవర్తన ఇక ఎట్లా వుండబోతుంది? మాకు తెలిసినంత వరకు మార్పు వుంటుందను కోము. ఒక ప్రత్యేక గ్రూపు కట్టి, రాజకీయం నడిపే ఓపిక, తీరిక యానాదిరెడ్డికి కల్గుతాయా? అసంభవం. వర్గాల మధ్య చిక్కు బడాల్సి వచ్చినప్పుడు పాదరసంలా మారి జర్రున జారిపోయె చాతుర్యం కల్గిన వాడు – వర్గాల నాయకత్వం నడప గల్గుతాడా? ఆ ఆశతో విజయభాస్కర రెడ్డి ఈ అవకాశం ఇచ్చి వుంటే మాత్రం ఆశా భంగమే!

యానాదిరెడ్డి గారికి మా హార్థిక అభినందనలు.

## సమీక్ష

(9 పేజీ కొరవ)

మించిన ద్వంద్వార్థపు మాటలు రచయిత రాశాడు. వెధవలకు పదవులొస్తె హంతకులకు, గూండాలకు కూడా అభిమానులన్న డైలాగులు సజీవాలే. పేరు మోసిన హంతకుడిగా (బాబూమోహన్) అతని పై మనసుపడ్డ పాయింట్ 'ఫైవ్' గా (బ్రహ్మానందం) చక్కని నటన, హాస్యం అందించారు. వేటూరి, భువనచంద్ర రాసిన వెన్నెట్లో చాలేసి, మనసు మారదు, స్వాతిలో ముత్యమంత పాటలు ప్రేక్షకులను అట్టె ఆకట్టు కొంటాయి. గాయని మిస్ మిని గాత్రంలో వెలువడిన పాటలో రాజస్థాన్ అందాలను కెమెరా మెన్ శరత్ చక్కగా చూపెట్టారు. పై మూడు పాటల్లో రాజ్–కోటి స్వరాలు సూపర్బ్. ముగ్గురు నృత్య దర్శకులు, ఇద్దరు పోరాట దర్శకులు మొత్తానికి బాగా కష్ట పడ్డారు.

రమ్యకృష్ణకు శరీరం పై కంఠ తక్కువ. దానికి తోడు కులుకుదనం ప్రేక్షకులను చిరెత్తిస్తుంది. పలు పాటల్లో రవీనాటాండన్ తన అందాలను ఆరబోసింది. ఈ గ్లామర్–యువతరం మరోసారి సినిమా చూసేలా చేస్తుంది. బాలకృష్ణ చాలా స్లిమ్‌గా కనిపించి ఫైట్స్ చేయడంలో కష్టపడడంతో పాటు పాటల్లో ప్రతిభ చూపారు. విలన్ కాఠిన్యం ప్రదర్శించడంలో దేవరాజ్ నూటికి నూరు మార్కులు కొట్టేశారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,